cmp FILE.









# కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి...
# రోజంతా దంతక్షయాన్ని నివారించండి!




కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొంటే ఎక్కువ దంతక్షయమును, ఎక్కువ మందికి అరికట్టినది దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ ప్రకటించబడనటుల శాస్త్ర పరీక్షలు నిరూపించినవి. ఎందుకంటె: కాల్గేట్ డెంటల్ క్రీముతో ఒకసారి పళ్ళు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. కాల్గేట్‌కు మాత్రమే యీ రుజువు ఉన్నది! ఎంతో చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీముతో రోజూ పళ్ళు తోముకొనుటకు పిల్లలు ఇష్టపడతారు!




శుభ్రమైన, తాజా శ్వాసను మరియు తెల్లగా మెరిసే పళ్ళకు..., ఎక్కువమంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్టుకంటె కాల్గేట్‌నే కొంటారు!

DC.G.41. తె.

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు

# మజా మజాగా ఉండండి...
# గోల్డ్ స్పాట్ త్రాగండి !







గోల్డ్ స్పాట్-ఇప్పుడే మీ కోసం ప్రత్యేకంగా

ఉండండి. గోల్డ్ స్పాట్ త్రాగండి.

తాజా రుచి కోసం గోల్డ్ స్పాట్

# అంతు లేని ఆనందాన్ని పొందండి
# చూయింగ్ గమ్ చప్పరించి చూడండి!




కమ్మని పెప్పర్‌మింట్ రుచిగల
చిక్‌లెట్స్
చూయింగ్ గమ్

**60 పైసలకు 12**




**10 పైసలకు 2**

WH 9760

ఆడమ్స్‌వారి శ్రేష్ఠమైన తయారీ

# నవ్వుల మధురిమ ఎప్పుడైనా రుచి చూశారా?



ఫాంటా ఆరంజి
రుచినేమందును?
మరిమరీ దాహం కావాలని
పించును!

ఫాంటా కోకా-కోలా కంపెనీవారి ఉత్పత్తి

CMCF-3-152-TEL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలో ప్రచురించిన బేతాళ కథ ["అర్ధరాజ్యం"] వై. నరేంద్ర నాథ్ పంపినది.

సిందబాద్ సాహసయాత్రలు ఈ సంచికతో ముగిసిపోతున్నవి.

ఈ సంచికలో హాస్యకథలు హెచ్చుగా అందిస్తున్నాము. "మనిషి-గుర్రమూ", "వ్యర్థవరాలు", "బెదిరిపోయిన దయ్యం", "సామాన్యమైన ప్రశ్నలు" ఈ రకానికి చెందినవి.

"గజదొంగ" అన్న కథలో దొంగలు అవలంబించదగిన కొత్త నీతి ఉన్నది.

సంపుటి 46 మే '70 సంచిక 5



CHITRA



# మనిషీ-గుర్రమూ

ఒక గ్రామంలో శివుడు అని ఒక పేద కుర్రవాడుండేవాడు. వాడు నిత్యసంతోషి. ఎప్పుడూ హాస్యాలతో మునిగి తేలేవాడు; కష్టపడి పనిచేసేవాడు కాడు. అందుచేత అతను దరిద్రుడుగానే ఉంటూ వచ్చాడు. అయితే అతన్ని ఆ విచారం అంతగా బాధించేది కాదు.

ఆ గ్రామంలో ఒక జమీందారుండేవాడు. శివుడు బొత్తిగా చేతిలో రాగిదమ్మిడీ కూడా లేనప్పుడు జమీందారుగారి దివాణానికి వెళ్ళి, అక్కడివాళ్ళు ఏ పని చెయ్యమంటే ఆ పని చేసేవాడు.

ఒకరోజు అతనికి జమీందారుగారి గుర్రాన్ని మాలీసు చేసే పని ఇచ్చారు. శివుడు ఆ గుర్రాన్ని తోముతూ, "బాగా ఉలవగుగ్గిళ్ళు దాణా తిని ఈ గుర్రం ఎలా కండలు పట్టిందో! దీని ఒళ్ళు ఎంత నిగనిగలాడుతున్నదో! అదృష్టమంటే దీని అదృష్టమే చెప్పాలి. నేను జమీందారుగారి గుర్రాన్నిగానయినా పుట్టాను కాను," అన్నాడు గట్టిగానే.

తాను గుర్రమై పుట్టటం గురించి ఆలోచించుకుంటేనే శివుడికి విపరీతంగా నవ్వు వచ్చేసింది. వాడి నవ్వు విని కాబోలు గుర్రం గడ్డి మెయ్యటం మాని వాడి కేసి తిరిగి చూసి, "హాస్యంగా అంటున్నావా, లేక నిజంగానే అంటున్నావా ఆ మాట?" అని అడిగింది.

గుర్రం మాట్లాడటం వినేసరికి శివుడు బిత్తరపోయి, నవ్వటం మానేసి, దాని కేసి వింతగా చూడసాగాడు. గుర్రం ఇంకా ఇలా అన్నది:

"జమీందారుగారి సవారీ ఎంత భయంకరమో, ఆయన కమ్చీ దెబ్బలు ఎలా ఉంటాయో, రికాబులతో డొక్కలో ఎలా పొడుస్తారో నీ కేమన్నా తెలుసా? తెలుసు

వి. మోహనరావు

కోవాలంటే, నా చెవులు రెండూ పట్టుకుని, నువు నేనై పోవాలని కోరుకో!''

శివుడు వెంటనే గుర్రం ముందుకు వెళ్ళి, దాని చెవులు రెండూ పట్టుకుని, "నేను జమీందారుగారి గుర్రం అయిపోవాలి," అన్నాడు.

మరుక్షణమే తాను గుర్రమైపోయినట్టు శివుడు తెలుసుకున్నాడు. గుర్రం స్థానంలో ఒక బైరాగివాడు నిలబడ్డాడు.

"ఏయ్, బైరాగీ, అలా చూస్తూ నిల్చున్నావేం? వెళ్ళి నాకు ఉలవ గుగ్గిళ్ళు పట్టుకురా!" అన్నాడు శివుడు.



కాని బైరాగివాడు గుర్రంమాట వినిపించుకోక గబగబా బయటికి జారుకున్నాడు.

తాను చేసినది పెద్ద పొరపాటని శివుడికిప్పుడు తెలిసి వచ్చింది. ఈ గుర్రం అవతారం నుంచి బయటబడే మార్గమేమిటో వాడికి తెలియలేదు. అవకాశం దొరికిన క్షణమే ఇంటికి పారిపోవాలని నిశ్చయించుకున్నాడు.

కొంతసేపయాక జమీందారు తన నౌకర్లతో గుర్రానికి జీను వేసి సిద్ధం చెయ్యమన్నాడు. నౌకరు ఒకడు వచ్చి, "శివా, ఒరే శివా!" అని కేక వేస్తే జవాబు రాలేదు. కొట్టంలో గుర్రం మాత్రమే ఉన్నది. వాడు గుర్రాన్ని విప్పి ఇవతలికి తీసుకువచ్చేటప్పుడు శివుడు కాళ్ళు ఝాడించి పరుగు లంకించుకున్నాడు. జమీందారు నౌకర్లు వాడి వెంటపడ్డారు.

శివుడు తిన్నగా తన ఇంటికి పరిగెత్తి, తన తల్లి ఉన్న చోటికి వెళ్ళాడు. ఆమె తనను దాస్తుందని వాడి భ్రమ. తనకు వచ్చిన కష్టం గురించి వాడు తల్లికి చెప్పుకున్నాడు. కాని వాడి భాష ఆమెకు కొంచెం కూడా అర్థమైనట్టు లేదు. లోపలికి వచ్చిన గుర్రాన్ని చూసి ఆమె కంగారుపడి, "ఛీ! ఛీ!" అని దాన్ని బయటికి తరమటానికి యత్నించింది.



ఈ లోపల జమీందారుగారి మనుషులు రానే వచ్చారు. వాళ్ళతోపాటు యింకెందరో వింత చూడవచ్చారు. అందరూ ఇంటిని చుట్టుముట్టి శివుణ్ణి పట్టుకుని ఇంటి బయటికి తెచ్చారు. కాని శివుడు వాళ్ళకు స్వాధీనం కావటానికి ఒప్పుకోక మొరాయించాడు, వెనక కాళ్ళమీద లేచాడు, నేలమీద పడి పొర్లిగింతలు పెట్టాడు. చివరకు అకస్మాత్తుగా లేచి మళ్ళీ తన ఇంట్లోకి వెళ్ళాడు. వాడి తల్లి భయంతో అరుస్తూ బయటికి పరిగెత్తింది.

పదిమందీ సాయం పట్టి శివుడికి జీను వేసి, కళ్ళాలు తగిలించి, బయటికి ఈడ్చుకు వచ్చి, చావగొట్టుతూ జమీందారుగారి ఇంటికి చేర్చారు. చాలాసేపటి క్రితమే ప్రయాణానికి సిద్ధమై ఉన్న జమీందారు తన గుర్రం మీద ఎక్కి కూర్చున్నాడు. అయితే ఎన్నడూ లేనిది, ఈ గుర్రం ఇవాళ ఒంటె లాగా కుడి పక్క రెండు కాళ్ళూ, తరవాత ఎడమ పక్క రెండు కాళ్ళూ ముందుకు వేసి నడుస్తున్నది. అలా నడిచే గుర్రం మీద కూర్చోవటం ఆయనకు చాలా బాధాకర మనిపించింది.

"దీని కేదో దయ్యం పట్టి ఉంటుంది!" అనుకున్నాడు జమీందారు. దారి కటూ ఇటూ నిలబడి జనం జమీందారునూ, గుర్రాన్నీ వింతగా, ముక్కుల మీద వేళ్ళు వేసుకుని చూస్తున్నారు. వాళ్ళను చూస్తే శివుడికి నవ్వు ఆగలేదు. వాడు వీధిమధ్యన, వెనకకాళ్ళమీద చతికిలబడి, ముందుకాళ్ళు గాలిలో ఆడిస్తూ వెర్రిగా నవ్వసాగాడు.

జమీందారు కాస్తా గుర్రం మీది నుంచి వెనక్కి జారి దుమ్ములో వెల్లికిలా పడి పోయాడు. ఆయన లేచి దుమ్ము దులుపు కుంటూ ఉంటే చూసి శివుడికి పశ్చాత్తాపం కలిగింది. అందుకని వాడు జమీందారు కేసి తన ముందుకాళ్ళు రెండూ జోడించాడు.

"చూడండి, చూడండి! గుర్రం జమీందారుగారికి దణ్ణం పెడుతున్నది." అన్నారు జనం ఆశ్చర్యంగా.

జమీందారుకు ప్రాణం చచ్చినట్టయింది. ఆయనకు అక్కడ ఒక్క క్షణం ఉండ బుద్ధి కాలేదు. అదృష్టవశాన గుర్రం మామూలుగా లేచి నిలబడింది. జమీందారు దాని మీద ఎక్కి కూర్చున్నాడు. అయితే ఆయన కళ్ళాలు చేతికి తీసుకునే లోపుగా గుర్రం శరవేగంతో పరిగెత్త నారంభించింది. అందుచేత జమీందారు ముందుకు పడిపోయి గుర్రం మెడ వాటేసుకుని, కింద పడకుండా చూసుకోవలసి వచ్చింది.

శివుడు అలా వేగంగా చాలాసేపు పరిగెత్తి అలిసిపోయాడు. వాడు ఒక గ్రామం చేరవచ్చి వేగం తగ్గించాడు. గ్రామస్తులు గుర్రాన్నీ రౌతునూ చూసి, రౌతు స్థితికి జాలిపడి సహాయం చెయ్యడానికి వచ్చారు. దుమ్ముకొట్టుకుని, తల వంచుకుని, గుర్రం మెడను కౌగలించుకుని ఉన్న జమీందారును, లోగడ ఆయన్ని చూసివున్న వాళ్ళు కూడా గుర్తించలేదు.

జమీందారు గుర్రం మీది నుంచి దిగాలన్న తొందరలో అందినవాణ్ణి పట్టుకుని తన బరువంతా వాడి మీద వేసి దిగబో



యాడు. అయితే జమీందారు చేతికి చిక్కినది ఒక మనిషి చెవి. ఆ మనిషి ఆ గ్రామానికి పెద్ద. ఆయనకు కోపం వచ్చి జమీందారును పట్టుకుని ఒక్క గుంజు గుంజి కింద పడేసి, కాలితో ఒక్క తన్నుతన్నాడు.

ఇదంతా చూసిన శివుడికి పట్టరాని ఆగ్రహం వచ్చి గ్రామపెద్ద జుట్టును బలమైన తన పళ్ళతో పట్టి పీకాడు. అప్పటికి వాడి కసి తీరలేదు; భయంకరంగా నోరు తెరిచి అందిన వాడినల్లా కరిచాడు. గ్రామస్థులు పారిపోయి, గుర్రాన్ని శిక్షించడానికి బరిసెలూ, ఈటెలూ, రోకళ్ళూ, దుడ్డుకర్రలూ తీసుకుని తిరిగి వచ్చారు.

శివుడికి కంపరం పట్టుకున్నది. వాడు వెనక్కు తిరిగి కాలిసత్తువకొద్దీ పరిగెత్తు కుంటూ తన ఊరు చేరి, జమీందారుగారి దివాణంలోని కొట్టంలో దూరి దాక్కు న్నాడు. జమీందారుగారు ఎక్కడో దిగబడి ఉంటాడనుకుని, ఆయన నౌకర్లు గుర్రాన్ని చక్కగా మాలిస్‌చేసి, జొన్నరొట్టే, ఉలవలూ పెట్టారు. వాటిని మెక్కుతూ శివుడు, "ఎంత బుద్ధిమాలిన పని చేశాను! నేను మళ్ళీ మామూలు మనిషిని కావటం ఎలా?" అనుకున్నాడు.

ఆ క్షణంలో కొట్టం తలుపులు తోసుకుని, బైరాగివాడు లోపలికి వచ్చాడు. వచ్చి, "ఏం, శివుడూ! గుర్రం బతుకు బాగుందా?" అని అడిగాడు.

"దివ్యంగా ఉన్నది! ఒక్కటే నా భయం—ఇంత బలమైన ఆహారం తింటు న్నానే, ఇదంతా బాగా జీర్ణించుకోగలనా అని!" అన్నాడు.

"అయితే మళ్ళీ నన్ను గుర్రం అయిపో నిస్తావేమిటి?" అన్నాడు బైరాగి.

"అదేం?" అన్నాడు శివుడు.

"నా పెళ్ళాం పోరు పడలేకనేగా నేను గుర్రమయానూ? అది నన్ను ఈ బైరాగి వేషంలో కూడా గుర్తుపట్టి వెంటపడింది. అదిగో, వచ్చేస్తున్నది. మహామారి! త్వరగా—" అంటూ బైరాగి ఎగిరి గుర్రం రెండు చెవులూ గట్టిగా పట్టుకుని, "నేను జమీందారుగారి గుర్రం అయిపోదును గాక!" అన్నాడు.

తరవాత ఏం జరిగినదీ శివు డెరగడు. మర్నాడు వాడు నిద్ర లేచేసరికి వాడు ఆ కొట్టంలో గడ్డి మీద పడుకుని వున్నాడు. వాణ్ణి జమీందారు మనుషులు ఒక్క ప్రశ్న అయినా వెయ్యలేదు.

ఇదంతా నిజంగా జరగలేదనీ, హాస్యాల మారి శివుడు కలగన్నాడనీ కొందరంటారు. అదే నిజమేమో!





# వ్యర్థ వరాలు

ఒక గ్రామంలో అడవికి సమీపంగా ఒక కట్టెలు కొట్టేవాడు భార్యతో సహా ఒక గుడిసెలో నివసిస్తూ ఉండేవాడు. కాపటానికి పేద వాళ్లయినా, ఇద్దరూ కష్టం చేసి జీవించినా, వాళ్ళకు సుఖంగానే జరుగుతూ ఉండేది.

అయితే వాళ్ల గుడిసెకు సమీపంలోనే కొందరు సంపన్నులు ఇల్లు కట్టారు. వాళ్ళు తమకన్న సుఖంగా బతకటం చూసినాక ఈ దంపతులకు కొంచెం కన్నుకుట్టింది.

ఒకనాడు రాత్రి గుడిసెలో కూర్చుని భార్యాభర్తలు ఈ విషయమే మాట్లాడు కుంటున్నారు.

"కొందరు పెట్టి పుట్టుతారు. మనక్కూడా ఇంత డబ్బుంటే చక్కగా కావలిసిందెల్లా కొనుక్కుని ఎంత హాయిగా ఉండేవాళ్లం!" అన్నది భార్య.

"నన్నడిగితే ఈ భాగ్యవంతులకు సుఖ పడటం తెలీదు. నాకే అంత డబ్బుంటేనా, ఎంత సుఖపడేవాణ్ణో!" అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

"వెనకటి రోజుల్లో దేవతలు కనబడి కోరిన వరాలిచ్చే వాళ్ళుట. ఎవరైనా దేవత వచ్చి మనని వరాలు కోరుకొమ్మంటే ఎంత బాగుండును!" అన్నది భార్య.

ఆమె మాట ఇంకా పూర్తి కాకముందే ఆ గుడిసెలో అకస్మాత్తుగా ఒక స్త్రీ ప్రత్యక్ష మయింది. ఆమెను చూడగానే దేవత అనీ, మామూలు మనిషి కాదనీ తెలిసిపోతున్నది.

"నేను దేవతను. వరాల కోసం మీరు తహతహలాడుతున్నారు గనక మీకు మూడే మూడు వరాలిస్తున్నాను. ఆ పైన మీరు కోరవద్దు. వాటితో తృప్తిపడండి," అని ఆ దేవత అంతర్ధానమయింది.

ఈ సంఘటనకు నిర్ఘాంతపోయిన ఆ పేద దంపతులు, దేనికోసం కోరుకోవాలో ఒకం తట నిర్ణయించుకోలేక తికమకపడ్డారు.

ఆర్. సుభద్ర

"నన్నడిగితే, మనం కూడా ధనవంతులమై, గొప్ప వాళ్ల లాగా ఉండాలని కోరుకోవటం మంచి దంటాను," అన్నది భార్య.

"నీ మొహం! డబ్బున్నంత మాత్రాన రోగాలూ రొష్టులూ రావా, దొంగలు పడి చావగొట్టరా? ఆరోగ్యమూ, దీర్ఘాయువూ ఉంటే చాలా నయం," అన్నాడు భర్త.

"బతికి ఏం లాభం? దీదరికంతో మరింత కాలం తీసుకోవటానికా?" అన్నది భార్య.

"అదీ నిజమే మరి. ఆలోచించి మరీ కోరుకుందాం వరాలు!" అన్నాడు భర్త.

భార్య వంట చెయ్యటానికి నిప్పు రాజేస్తూ, "ఈ పూట కూరకు చేపలుంటే ఎంత బాగుండేది!" అన్నది.

ఆమె అలా అనటమే తడవుగా పైనుంచి కొన్ని చేపలు ఆమె ముందు పడ్డాయి.

మూడు వరాలలోనూ ఒకటి తీరిందని గ్రహించి భర్త, "ఎంత పని చేశావే పాపిష్టి దానా? వెధవ కోరిక కోరితివే? ఇంతకన్న ఈ చేపలన్నీ నీ మెళ్ళో హారంగా పడాలని కోరుకోకపోయావూ? బాగుండేది!" అన్నాడు.

మరుక్షణంలో ఆ చేపలన్నీ ఒక హారంగా ఏర్పడి, భార్య మెడను అలంకరించాయి.

"నువ్వు చేసిన నిర్వాకం మాత్రం ఏమిటి? నేనొక వరం పాడుచేస్తే నువ్వు మరొకటి పాడు చేశావు." అంటూ ఆమె ఆ చేపల హారాన్ని తన మెడలో నుంచి తీయటానికి ప్రయత్నించింది. కాని ఆ చేపల్ల హారం ఆమె ఒంటికి అంటుకుపోయి ఊడిరాలేదు. భర్త కూడా దాన్ని తీయలేకపోయాడు.

"ఛీ, ఛీ! చేపలు కూరవండుకు తినటానికి కూడా లేకుండా చేశావు. ఇది ఊడి రాకపోతే నేను ఉరి పోసుకు చస్తాను. వరాలు లేకపోతే పీడాపోయింది. ఈ అవమానం భరించలేను," అన్నది భార్య.

చేసేది లేక, కట్టెలు కొట్టేవాడు తన భార్య మెడలోని హారం ఊడి రావాలని కోరుకున్నాడు.





# శిథిలాలయం

## 29

[రాత్రివేళ శిఖిముఖి వాళ్ళను వృశ్చికలంక లోని ఆదిమవాసులు పట్టుకున్నారు వాళ్ళ నాయకుడు చెప్పిన వెర్రి వెలగపండు కోసం నాంగ్‌సాంగ్ వెళ్ళి, అక్కడ కాపలా వున్న వాణ్ణి పట్టుకుని, కాళ్ళూ చేతులూ కట్టివేశాడు. వాడు పక్క నున్న బండరాయితో పాటు, శిఖిముఖి వాళ్ళు నిద్రపోతున్న కొండ దిగువకు దొర్లుకు రాసాగాడు. తరవాత—]

గుహలో నిద్రపోతున్న వృశ్చికజాతి వాళ్ల నాయకుడికి, గుహముందు కునికిపాట్లు పడుతున్న శిఖిముఖి అతడి అనుచరులకూ, కొండపై నుంచి దొర్లుకు వస్తున్న బండ రాయీ, కాపలావాడూ కలిసి చేసే పెద్ద ధ్వని భయం కలిగించింది. ఏదో పెను తాకిడికి కొండ శిఖరం తునాతునకలై కింద పడుతున్న దనుకున్నాడు, శిఖిముఖి. అతడు గొంతెత్తి తనవాళ్ళను, హెచ్చరించే లోపలే, గుహలో నుంచి వృశ్చికజాతివాళ్ళ నాయకుడు మెరపులా బయటికి వచ్చాడు.

"కొండ అంచు నుంచి దూరంగా పరిగెత్తండి. భూకంపం! భూకంపం!" అంటూ అరిచాడు వాడు.

ఆ హెచ్చరిక వింటూనే అందరూ పారిపోబోయేంతలో, పెద్ద ధ్వనితో బండ రాయీ, ఓ క్షణం ఆలస్యంగా కాపలా వాడూ కొండ మీది నుంచి కిందబడ్డారు.



చెప్పేందుకు నేను కొండ మీది నుంచి దొర్లి వచ్చాను," అన్నాడు.

ఈ మాటలు వృశ్చిక నాయకుణ్ణీ, శిఖి ముఖి, విక్రమకేసరుల్ని కూడా ఆశ్చర్య పరిచినై. శిఖిముఖి తన అనుచరుల కేసి చూసి, వాళ్ళల్లో నాంగ్‌సోమ్ లేడని తెలుసుకున్నాడు. అతడు విక్రమకేసరితో యీ సంగతి చెప్పబోయేంతలో వృశ్చిక నాయకుడు గడగడ వణికిపోతూ, "మీలో ఒకడు రహస్యంగా ఆ వెర్రివెలగపళ్ళ కోసం వెళ్లాడు. ఒకవేళ దుస్సాహసం కొద్దీ వాడా పండు తిన్నాడో, చాలా చిక్కుల్లో పడిపోతాడు. ఇప్పుడేం చేయటం?" అన్నాడు.

"అలా అయితే మనం త్వరగా పోయి నాంగ్‌సోమ్ ఆ వెలగపండు తినకుండా ఆపే ప్రయత్నం చేద్దాం. ఇంతకీ ఆ పండు తింటే రాబోయే ప్రమాదం ఏమిటి?" అన్నాడు శిఖిముఖి.

"వృశ్చికజాతి వాళ్ళ నాయకుడు తప్ప మరెవరూ ఆ వెర్రివెలగపండు తిని నిభాయించుకోలేరు. ఆ మధ్య నాకు పట్టుబడ్డ శిఖవాడికి — వాడు పెట్టుకున్న పేరు — శిథిలాలయపూజారి కామాలు — వాడి చేత ఆ పండు తినిపించి, నిజం మాట్లాడేటట్టు

అదృష్టవశాన బండరాయి మనుషులెవరూ లేని చోట పడింది. కాని కాపలావాడు మాత్రం కీచుమని అరుస్తూ తన జాతివాళ్ళిద్దరి మీద దభీమంటూ పడిపోయాడు.

వృశ్చికజాతి నాయకుడు కిందపడి మూలుగుతున్న కాపలావాణ్ణి సమీపించి, "ఇదేమిటి? కాళ్ళూ చేతులూ కట్టుకున్నావేం?" అని ప్రశ్నించాడు.

వాడు తడబడుతూ లేచి నిలబడి, "మనం పట్టుకున్న యీ ఇభ్యజాతి వాళ్ళల్లో ఒకడు నేను కాపలాకాసే చోటుకు వచ్చి, దొంగదెబ్బ తీసి నా కాళ్ళూ చేతులూ కట్టివేశాడు. ఈ సంగతి





చేద్దామనుకున్నాను." అన్నాడు వృశ్చిక నాయకుడు.

శిఖిముఖి వృశ్చిక నాయకుడితో, "నాంగ్‌సామ్ ఎవర్నీ మోసగించి వెర్రి వెలగపండు కోసం వెళ్ళలేదు. అతడికి మధ్య, యీ ప్రాంతాల గాలీ నీరూ పడక మనస్థిమితం కాస్త తప్పింది. మనం మనం అంతా మిత్రులం. శిధిలాలయం ఎక్కడుందో కనుక్కోవటంలో నీకు అన్ని విధాలా సాయపడగలం. ముందు నాంగ్‌సామ్ ఎక్కడున్నాడో వెతికి పట్టుకుందాం పదండి," అన్నాడు.

నాంగ్‌సామ్ వెర్రివెలగపండు తినివుంటే అతణ్ణి తప్పక వృశ్చికమాతకు బలి యిస్తానని వృశ్చిక నాయకుడు తన వాళ్ళతో చెప్పి, శిఖిముఖివాళ్ళతో, "పదండి! పండు తిని మీ వాడు ప్రాణం మీదికి తెచ్చుకోక ముందే పట్టుకుందాం," అన్నాడు.

అందరూ వృశ్చిక నాయకుడి వెంట వెర్రివెలగపండు చెట్లున్న కొలను కేసి బయలుదేరారు. కాని, యీ లోపలే నాంగ్‌సామ్ వెలగచెట్టెక్కి ఒక పండు కోసుకుని తిన్నాడు. అది తిన్న కొద్ది క్షణాలకల్లా అతడికి ఏదో మైకం కమ్మినట్టయిపోయింది. తాను నిలబడ్డ భూమీ, చెట్టు చేమలూ, కొండలూ—అన్నీ గిర్రున తిరిగిపోతున్నట్టు తోచింది.

"నేను తిన్నది వెర్రివెలగపండు! నాకేదో వెర్రెత్తుతున్నట్టున్నట్టున్నది. ఈ వెర్రితోగాని భూగర్భంలో వున్న శిధిలాలయం కనుక్కోలేనేమో! అసలు శిధిలాలయం, వృశ్చికమాత మందిరం ఒకటేనా? ఒకటే! అదుగో శిధిలాలయం! అదుగో, వృశ్చికమాత మందిరం!" అంటూ నాంగ్‌సామ్ తల పీక్కుని, అరుస్తూ కొండదార్ల వెంట పరిగెత్తసాగాడు.

అతణ్ణి పట్టుకునేందుకు బయలుదేరిన శిఖిముఖి వాళ్ళకు అతడు చెట్లల్లో నుంచి,





కొండకోనల్లో నుంచీ అరిచే అరుపులు తప్ప మనిషి మాత్రం కనిపించలేదు. ధ్వని వచ్చిన దిక్కుగా వాళ్ళు సూర్యోదయం అయే వరకూ అతడి కోసం గాలించి, బాగా అలిసిపోయి, ఒక కొండ అంచున వున్న చెట్ల కింద కూలబడ్డారు.

వెర్రివెలగపండు చెట్లున్న కొలనుకు అవల నున్న అరణ్యంలో వృశ్చికజాతివాళ్ల కాపుదలలో వున్న శిథిలాలయ పూజారికి, నాంగ్‌సోమ్ పిచ్చిగా వేసే కేకలు, ఆ రాత్రి వేళే వినిపించినై. అతడు తన అనుచరులైన నవరభేరుండాన్నీ, తతిమ్మావాళ్ళనూ హెచ్చరించి, వృశ్చికజాతి కాపలా వాళ్లతో, ఆ కేకలు పెట్టేవాడు వృశ్చికమాత ఆవేశించిన మహాభక్తుడనీ, అతణ్ణి అనుసరించిపోతే, మాతమందిరం కనబడుతుందనీ నమ్మబలికాడు.

మాయమర్మాలు అంతగా ఎరగని వృశ్చిక జాతివాళ్ళు, శిథిలాలయ పూజారి వెంట నాంగ్‌సోమ్ కోసం బయలుదేరారు. తూర్పు తెలతెలవారుతూండగా వాళ్ళకు ఒక గుహ ముందు నాంగ్‌సోమ్ కనిపించాడు. గుహాముఖం చిక్కని సాలెగూటితో కప్పబడి వున్నది. అందులో ఒక రాకసితేలు చిక్కుకుని, బయట పడేందుకు నానా ప్రయాసా పడుతున్నది.

నాంగ్‌సోమ్ ఆ సాలెగూటి ముందు కత్తి పట్టుకుని అటూ యిటూ గెంతుతూ, "రక్షించండి! రక్షించండి! భయంకర జలజంతువు నన్ను మింగబోతున్నది!" అంటూ అరుస్తున్నాడు.

ఆ అరుపులూ, నాంగ్‌సోమ్ భయంతో వణికిపోతున్న తీరూ చూసి, శిథిలాలయ పూజారి అతడికి వెర్రి వెలగపండు తిన్న కారణంగా మతిస్థిమితం తప్పిందని గ్రహించాడు. వృశ్చికజాతివాళ్ళు నమ్ముతున్నట్టు బహుశా ఆ స్థితిలోనే అతడు నిజమైన శిథిలాలయం ఎక్కడ వున్నదో

కనుక్కోవచ్చున్న నమ్మకం కూడా అతడికి కలిగింది.

పూజారి అతణ్ణి సమీపించి, "నువ్వు ఇభ్యుజాతి వాడివి కాదా? నిన్ను గోల్‌భరా గ్రామంలో చూశాను. నీ పేరు నాంగ్‌సోమ్, అవునా?" అని ప్రశ్నించాడు.

నాంగ్‌సోమ్ ఆ మాటలు వింటూనే ఉలిక్కిపడి వెనక్కు తిరిగి, "నెత్తి మీద శిఖతో యిక్కడ అవతరించిన మహాను భావులు మీ రెవరు? సిద్ధుల్లా వున్నారు. నన్ను యీ ఖడ్గమృగం నుంచి కాపాడాలి," అంటూ పూజారికి సాష్టాంగపడ్డాడు.

పూజారి అతణ్ణి భుజాలు పట్టుకుని లేపి నిలుచో పెట్టి, "అది ఖడ్గమృగం కాదు. రెండు తలల గండభేరుండం. ఒక్క క్షణంలో చంపేయిస్తాను," అంటూ పక్క నున్న సవరభేరుండంతో, "భేరుండం! ఆ పిశాచిని నరుకు," అన్నాడు.

ఆ వెంటనే భేరుండం కత్తితో తేలును బలంగా కొట్టాడు. అది రెండుగా తెగిపోయి, రక్తంతో సాలెగూడు తడిసిపోయింది. నాంగ్‌సోమ్ ఆ నెత్తురు చూస్తూనే వణుకుతూ పూజారి పాదాలు పట్టుకుని, "మహా సిద్ధులు నన్ను రక్షించాలి! నెత్తుటి ప్రవాహంలో కొట్టుకుపోతున్నాను. ఈతరాదు!" అన్నాడు.



శిథిలాలయ పూజారి అతడికి అభయం యిస్తున్నవాడిలా చేతిని తల మీద పెట్టి, "నీ కొచ్చిన భయం ఏమీ లేదు. రక్తపు టేరును, సెలయేటి జాలుగా మార్చాను. నువ్వు దాని వెంట బయలుదేరి భూగర్భంలో శిథిలాలయం వున్నచోటు చేరు," అన్నాడు.

"గురుసిద్ధా, తమ ఆజ్ఞ!" అంటూ నాంగ్‌సోమ్ అక్కణ్ణించి కదిలి వేగంగా నడవసాగాడు.

శిథిలాలయ పూజారి తన బంట్లతో, "బల్లి తోక పట్టుకుని బ్రహ్మపుత్రానది యీద చూసినట్టుంది మన పని! అయినా ఏ పుట్టలో ఏ పాముందో చెప్పలేం. వీడి



వెర్రి మనను శిధిలాలయం చేర్చినా చేర్చ వచ్చు. వీడు పారిపోకుండా జాగ్రత్త పడాలి," అని చెప్పి నాంగ్‌సోమ్ వెంట నడవసాగాడు.

నాంగ్‌సోమ్ వాళ్ళను ఆ చుట్టు పక్కల గల గుట్టల్లో, చెట్లల్లో నానా గిరికీలూ కొట్టించాడు. వెర్రి వెలగపండు విషం అతడి మస్తిష్కాన్ని బాగా వశపరుచుకున్నది. అతడికి ప్రతి చిన్న ప్రాణీ ఏనుగంత ఆకారంలో భయంకరంగా కనబడసాగింది. అలాంటి సమయాల్లో అతడు పెద్దగా, "గురుసిద్ధా, నీవే రక్ష!" అంటూ కేకలు పెట్టసాగాడు.



మిట్టమధ్యాహ్నం వేళకు నాంగ్‌సోమ్ అందర్నీ ఒక ఎత్తయిన పర్వతం మీదికి చేర్చాడు. దిగువను ఒక చిన్న లోయ వున్నది. ఆ లోయలో చాలా ఎత్తుగా, గుబురుగా పెరిగిన వటవృక్షాలు అసంఖ్యాకంగా వున్నవి.

నాంగ్ లోయ కేసి ఓ మారు చూసి జుట్టు గట్టిగా పీక్కుని, "గురుసిద్ధా! శిధిలాలయం ఆ అగాధంలో వున్నది. ఎంత బంగారం! ఎన్ని మణిమాణిక్యాలు! ఆలయం మీది కలశం....అదుగో, మెరుస్తున్నది!" అన్నాడు.

శిధిలాలయపూజారి లోయలోకి తొంగి చూశాడు. నాంగ్‌సోమ్ చెప్పిన వేమీ అతడికి కనిపించలేదు. పెద్ద పెద్ద ఊడలు దించుకున్న వటవృక్షాలు మాత్రం అతడి కంటబడినై.

"ఇది వెర్రి వాగుడు! వెధవ మనల్ని గుట్టలూ పుట్టలూ తిప్పి నానా హైరానా పెట్టాడు. లోయలోకి తోసేస్తే సుఖపడి పోతాం," అన్నాడు శిధిలాలయపూజారి కోపంగా.

ఆ మాట వింటూనే సవరభైరుండం ముందుకు వచ్చి, "గురుప్రభో! శాస్త్రిని వున్న పళంగా తోయమన్నారా, ముక్కలుగా నరికి విసరమన్నారా?" అన్నాడు.







మరుక్షణం వృశ్చికజాతివాళ్లలో కలకలం లేచింది. వాళ్ళు రాతి గొడ్డళ్ళను పైకెత్తి ముందుకు వచ్చి, "ఈ ఇభ్యజాతి వాడికి ఎలాంటి హానీ జరగ్గూడదు. అతడు వృశ్చికమాత గణాచారి. అతడు చెప్పినట్టు ఆ లోయలో వృశ్చికమాత మందిరం వున్నదేమో ఎవరు చూశారు!" అన్నారు.

పూజారి ఏదో అనబోయేంతలో సవరభేరుండం చేతులు వూపుతూ, "అదీ నిజమే, గురుప్రభో! అలా గాల్లోకి ఎగిరి లోయలో వాలమన్నారా?" అన్నాడు.

శిధిలాలయపూజారి అతణ్ణి గట్టిగా కసిరి, "నువ్వు మళ్ళీ అతిగా తాగటం మొదలు పెట్టినట్టుంది. జాగర్త. కొండ ముచ్చుగా మార్చి, యిక్కడి చెట్ల మీద వదిలి పోతాను," అన్నాడు.

"గురుప్రభో! అలా చేయకండి. కొండ ముచ్చులు కొండల్లో తప్ప చెట్ల మీద బతకటం...."

సవరభేరుండం మాట పూర్తి చేసే లోపలే పూజారి కీచుమంటూ ఒక్క ఎగురెగిరి, "అదె, వచ్చె వచ్చె! శబరశుంత శిఖిముఖీ వాడిదండూ!" అన్నాడు.

శిఖిముఖి కొండ మీదికి వస్తూనే, "నాంగ్‌సోమ్‌ను కొండ అంచు నుంచి యివతలికి లాగండి," అని శిధిలాలయపూజారిని చూసి, "దుర్మార్గుడా, యింత కాలానికి దొరికావ్! పారిపోవాలని చూశావో వీపులో కత్తో, బాణమో గుచ్చుకుంటుంది," అన్నాడు.

ఎలా పారిపోవటమా అని ఆలోచిస్తున్న పూజారికి, శిఖిముఖి మాటల్తో ఒక ఉపాయం తోచింది. అతడు చప్పున ముందుకు దూకి నాంగ్‌సోమ్‌ను భుజాన వేసుకుని, కొండ అంచునే పరిగెత్తుతూ ఇరుకు రాళ్ల మధ్య జొరబడ్డాడు.

పాము బారి నుంచి తప్పుకుని పులినోట పడినట్టయింది, పూజారి పని. అటు వైపు నుంచి కుంటుతూ వస్తున్న జాంగ్‌లా ఒక్క



గావు కేక పెట్టి, "పాపాత్ముడా! ఇక నువ్వు ప్రాణాలతో పారిపోలేవు!" అంటూ అతడి మీదికి ఉరికాడు.

శిథిలాలయపూజారి, నాంగ్‌సోమ్‌ను భుజం మీది నుంచి కిందికి జార్చి, మొలను వేలాడుతున్న చురకత్తితో జాంగ్‌లా గుండెలకు గురి చేసి పొడవ జూశాడు. కాని అంతలో జాంగ్‌లా వచ్చి మీద పడటంతో, కత్తి గురి తప్పి అతడి భుజంలో గుచ్చుకున్నది. జాంగ్‌లా అంత బలమైన కత్తిపోటునూ లెక్క చేయకుండా పూజారి మెడ పట్టుకోబోయాడు. కాని, పూజారి తల పక్కకు తిప్పి కొండ అంచుకు ఒరిగిపోవటంతో, అతడి నెత్తిమీది శిఖ జాంగ్‌లా చేతికి దొరికింది.

జాంగ్‌లాకు తగిలిన గాయం నుంచి రక్తం కారుతున్నది. కాని, అతడు పూజారి శిఖ వదలకుండా గట్టిగా పట్టుకుని కొండ మీదికి లాగేందుకు ప్రయత్నిస్తున్నాడు. పూజారి తాను కింది లోయలో పడిపోతానన్న భయంతో గిలగిల తన్నుకుంటున్నాడు.

ఆ పరిస్థితుల్లో శిఖిముఖి అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, "జాంగ్‌లా, నీ స్వామిభక్తి మెచ్చదగింది. సవరగండు పోతు కూతురు నాగుమల్లి, వీడి శిఖ కావాలన్నది!" అంటూ కత్తితో శిథిలాలయ పూజారి శిఖ మొదటికంటా కోశాడు. మరుక్షణం శిథిలాలయపూజారి ఒక్క చావుకేక పెట్టి లోయలోకి పడిపోయాడు.

ఆ క్షణం వరకూ నాంగ్‌సోమ్ ఏం చేస్తున్నదీ ఎవరూ గమనించలేదు. అతడు లోయలోని మహా వటవృక్షాల కేసి కన్నార్పకుండా చూడ సాగాడు. అతడికి శిథిలాలయ పూజారి పెట్టిన చావుకేక వినిపించింది. ఆ వెంటనే నాంగ్‌సోమ్, "అదుగో, శిథిలాలయం!" అని అరిచి లోయలోని వటవృక్షాల కేసి దూకేశాడు.

—(ఇంకా వుంది)





# అర్ధరాజ్యం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కేవలమూ శ్రమ వల్ల కార్యసిద్ధి కావటం సందేహాస్పదం. అందుకు నిదర్శనంగా నీకు ప్రతాపు డనేవాడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను." అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం ఒక గొప్పదేశంలో ఒక గజదొంగ ఉండేవాడు. వాడు చోరవిద్యలన్నిటిలోనూ ఆరితేరినవాడు. ఎండుటాకుల మీదుగా కూడా వాడు నిశ్శబ్దంగా పోగలడు; కటిక చీకటిలో సైతం స్పష్టంగా చూసే శక్తినిచ్చే అంజనం లాంటివి ఎన్నో ఉపకరణాలు వాడి వద్ద ఉండేవి. ఆ కారణం చేత వాడు యౌవనంలో ప్రవేశించే నాటికే అంతులేని సంపదలు కొల్లగొట్టి దాచాడు.

## బేతాళ కథలు



ఈ గజదొంగను చూసినవారు లేరు. వాణ్ణి పట్టినవారు అంతకన్నా లేరు. కాని ప్రజలు వాడికి ప్రచండు డని పేరుపెట్టారు. వాణ్ణి పట్టటం కోసం వెయ్యిప్రయత్నాలు చేయించిన ఆ దేశపు రాజుగారు, చివరకు ప్రాణం విసిగి, ప్రచండుణ్ణి పట్టి ఇచ్చిన వారికి తన కుమార్తె నిచ్చి పెళ్ళిచేస్తానని తన దేశమంతటా చాటింపు వేయించాడు.

రాజకుమార్తె పేరుమోసిన సౌందర్యవతి. ఆమెను పెళ్ళాడే అవకాశం దొరుకుతుంది గదా అని చుట్టుపక్కల ఉన్న రాజకుమారు లందరూ ప్రచండుణ్ణి పట్టుకునే టందుకు నడుములుకట్టారు.

ఇందువల్ల ప్రచండుడికి పెద్ద చిక్కు వచ్చిపడింది. తన కోసం అంతమంది గాలిస్తుంటె అతను దొంగతనానికి బయలుదేరటం ప్రమాదకరం. అంత దాకా తాను సంపాదించుకున్నది తీసుకుని మరో దేశానికి పోవాలన్నా దారిలో ఉండే దేశాలవాళ్ళు తన కోసం వెయ్యికళ్ళతో చూస్తూ ఉంటారు. తాను ఉత్త చేతులతో పోతే ఎవడూ కనుక్కోలేడు. కాని ఇంతకాలం కష్టపడి సంపాదించుకున్నది-వదిలేసి పోవటం అవివేకం; దాన్ని వెంట తీసుకుపోతే దారిలో ఎవడో ఒకడు తనను అనుమానించి పట్టుకుని, రాజుగారికి అప్పగించి, రాజకుమార్తెను పెళ్ళాడవచ్చు. అందువల్ల తనకూ ముప్పు, రాజకుమార్తెకూ ముప్పు. అదాపుడి కొంత తగ్గే దాకా తగ్గి ఉండి, అందరూ తనను మరిచిపోయాక గాని, లేదా రాజకుమార్తె తగిన వరుణ్ణి పెళ్ళాడే దాకా గాని ఆగి, అప్పుడు మరో దేశానికి పోయి సుఖంగా బతుకుదా మనుకున్నాడు ప్రచండుడు. అతను దొంగతనాలకు వెళ్ళటం పూర్తిగా నిలిపివేసి, ఎవరికీ అనుమానం కలగకుండా కఠినమైన కూలిపనులు చేస్తూ, భరించరాని దారిద్ర్యంతో బాధపడుతున్నట్టు నటించసాగాడు.




ఒక ఏడాది గడిచింది. ఎక్కడా దొంగ తనాలు లేవు. రాజుగారూ, ప్రజలూ కూడా ఆ గజదొంగను గురించి దాదాపు మరిచి పోయారు. వాడు దేశం నుంచి ఏనాడో పారి పోయాడనీ, అకస్మాత్తుగా చచ్చిపోయాడనీ రకరకాలుగా జనం చెప్పుకున్నారు.

రాజు వద్ద కొలువు చేసే యోధులలో ప్రతాపు డనేవాడు ఒకడు ఉండేవాడు. వాడు చిన్నవాడైనా, యుద్ధాలలో అసాధారణమైన సాహస పరాక్రమాలు ప్రదర్శించి రాజుగారి అభిమానపాత్రు డయాడు. అతడు మొదటిసారి రాజకుమార్తెను చూసి నప్పుడే ఆమెను తీవ్రంగా మోహించాడు; తన వంటి సామాన్య యోధుడికి రాజకుమార్తెను పెళ్ళాడే అవకాశం ఉండదని ఎంతగానో నిరాశ చెందాడు.

ఇంతలో రాజుగారి చాటింపు జరిగింది. ప్రచండుణ్ణి పట్టుకునేటందుకు ప్రతాపుడు చేసిన కృషి మరెవ్వరూ చేసి ఉండరు. అతను మారువేషం వేసుకుని, ప్రచండుణ్ణి ఎరుగుదునన్న వ్యక్తి ఎక్కడన్నా కనబడతాడేమోనని కాలుకాలిన పిల్లి లాగా నగరం అన్ని మూలలా తిరిగాడు. రాత్రివేళల వీధులన్నీ కారాడి, తానే దొంగగా రాజభటులకు పట్టుబడినంత పని కూడా చేశాడు.

ప్రతాపుడు ఇంత శ్రమపడటానికి మరొక కారణం ఏమంటే, రాజకుమార్తె తనను ప్రేమించిందని అతనికి గట్టి నమ్మకం కుదిరింది. ఎందుచేతనంటే, ఒకసారి అతను, రాజుగారూ, రాజకుమార్తె ఉండగా రాజుగారి ప్రకటన విషయం ప్రస్తావించి, "ప్రచండుణ్ణి ఏ మామూలు మనిషో పట్టి ఇచ్చినట్టయితే రాజకుమార్తెకు తీరని అన్యాయం జరుగుతుంది," అన్నాడు. వెంటనే రాజకుమార్తె, "తండ్రిగారి ఆజ్ఞను పాలించి ఆయన మాటను నిలబెట్టడం కన్న కుమార్తెకు ఉత్తమ ధర్మం ఉండదు. అదిగాక, ఎంతో సాహసమూ, పరాక్రమమూ



లేనివాడు ప్రచండుణ్ణి పట్టగల డనుకోను. నాకు ప్రచండుడి శక్తులలో పూర్తి విశ్వాసం ఉన్నది," అన్నది.

అది మొదలు ప్రతాపుడు దొంగను పట్టటానికి రెట్టింపు శ్రమపడ నారంభించాడు. అయితే అతని శ్రమ వ్యర్థమైపోయింది. ప్రచండుడు దేశం విడిచి పోయినట్టూ, చచ్చిపోయినట్టూ ప్రజలు రకరకాలుగా చెప్పుకుంటూ ఉంటే ప్రతాపుడు నీరసపడి పోయాడు. రాజకుమార్తెను పెళ్ళాడటానికి బహు చక్కని అవకాశం దొరికినట్టే దొరికి, చేయిజారిపోయింది గదా అని అతడు బాధపడసాగాడు.

అప్పటికీ ప్రతాపుడి మనస్సులో ఏ మూలనన్నా అవంత ఆశ మిగిలి ఉంటే రాజుగారు దాన్ని నాశనం చేసి, తన కుమార్తెకు తగిన వరుడి కోసం మంత్రులతో ఆలోచనలు ప్రారంభించాడు. పరిసర దేశాల రాజకుమారులలో ఆమెకు తగిన వరుళ్ళు లేకపోలేదు; వారిలో ఎవరిని ఎన్నుకోవటమా అన్నదే ప్రశ్న అయి కూర్చున్నది.

ఈ స్థితిలో ప్రతాపుడు సాహసానికి ఒడిగట్టాడు. ఒకనాటి సాయంకాలం రాజకుమార్తె ఉద్యానంలో తన చెలికత్తెతో విహరిస్తూ ఉండగా అతను మారువేషంతో వచ్చి ఆమెను ఎత్తుకుపోయి, తన ఇంటనే ఒక గదిలో రహస్యంగా దాచి ఉంచాడు.

ఈ వార్త క్షణాల మీద రాజుగారికి తెలిసిపోయింది. ఆయన వెంటనే ఒక చాటింపు నగరంలో వేయించాడు. రాజకుమార్తెను తీసుకు వచ్చిన వారికి అర్ధరాజ్యం!

రాజకుమార్తెను ఎత్తుకు పోయినవాడు కూడా ప్రచండుడే అయి ఉంటాడని చాలా మంది ఊహించారు. అయితే ప్రచండుడికి రాజుగారు వేసిన ఈ చాటింపుతో ఆశ తల ఎత్తింది. రాజకుమార్తెను తిరిగి రాజుగారికి చేర్చినట్టయితే తనకు అర్ధరాజ్యం వస్తుంది; అప్పుడు తాను ఎంత వైభవంగా బతికినా

శంకించే వారుండరు. అందుచేత అతను రాజకుమార్తెను వెతకటానికి పూనుకున్నాడు.

రాజకుమార్తెను ఎత్తుకు పోవటానికి శక్తి సామర్థ్యాలున్నవారు నలుగురైదుగురి కంటె లేరు. ఈ దురన్యాయం జరిగిన సమయంలో వారంతా ఎక్కడెక్కడ ఉన్నదీ ప్రచండుడికి తెలికగానే తెలిసిపోయింది; ఒక్క ప్రతాపుడి సంగతే అనుమానాస్పదంగా కనిపించింది.

అర్ధ రాత్రి కావస్తూండగా ప్రచండుడు సునాయాసంగా ప్రతాపుడి ఇంట ప్రవేశించాడు. ఒక గదిలో ప్రతాపుడూ, రాజకుమార్తే మాట్లాడటం వినపడింది.

"నేను నిన్ను ప్రేమించాననని ఎవరు నీతో చెప్పారు? ప్రచండుణ్ణి పట్టుకునే వాణ్ణి పెళ్ళాడ వలిసిన బాధ్యత నాపైన ఉండగా నేను ఎవరిని గాని ఎలా ప్రేమిస్తాను? తొందరపడి నీ ప్రాణం మీదికి తెచ్చుకున్నావు. చేతనైతే నన్ను ఈ రాత్రే మా ఇంటికి చేర్చు. అలా చేస్తే నీ పేరు బయటపెట్టను." అంటున్నది రాజకుమార్తె.

"నీ కోసం ప్రాణాలు పోగొట్టుకోవటానికైనా నేను సిద్ధమే. నాకు దొరికావు. నిన్ను ఎలా వదిలి పెడతాను? మర్యాదగా నన్ను పెళ్ళాడటానికి ఒప్పుకో. మన వివాహం







అయిపోతే రాజుగారు క్షమిస్తారు. ఇంకెక్కడి ప్రచండుడు? వాడెప్పుడో చచ్చాడు. వాణ్ణి ఒకరు పట్టుకునే దేమిటి? నిన్ను పెళ్ళాడే దేమిటి?'' అంటున్నాడు ప్రతాపుడు.

ఇంతలో చిన్నగా తలుపు చప్పుడయింది. ప్రతాపుడు వారించే లోపల రాజకుమార్తె చప్పున వెళ్ళి తలుపు తెరిచింది. ప్రచండుడు లోపల ప్రవేశించి రాజకుమార్తెతో, ''మీ కోసమే వచ్చాను. మన ఇంటికి పోదాం పదండి. రాజుగారు తమ కోసం చాలా ఆందోళన పడుతున్నారు,'' అన్నాడు.

ప్రతాపుడు ప్రచండుడి పైకి పులి లాగా లంఘించాడు. ఇద్దరూ కలియబడి తన్నుకోసాగారు. ఈ అలికిడికి ప్రతాపుడి సేవకులు పరిగెత్తుకుంటూ వచ్చారు.

''పట్టుకోండి! వీడే ప్రచండుడు!'' అని ప్రతాపుడు తన సేవకులను హెచ్చరించాడు. ఆ వచ్చిన వాడెవడైనా కాని, వాడే ప్రచండుడని రాజకుమార్తెనూ, రాజునూ నమ్మిస్తే, తన కోరిక ఈడేరుతుందన్న ఆలోచన మెరుపు లాగా మనస్సులోకి వచ్చి ప్రతాపుడు అలా అన్నాడు. అసలు ప్రచండుడు చచ్చాడనే అతని విశ్వాసం.

సేవకులు ప్రచండుణ్ణి పట్టుకున్నారు. ప్రచండుణ్ణి వెంట బెట్టుకుని ప్రతాపుడు రాజుగారి దగ్గిరికి బయలుదేరాడు. అతనితో బాటు రాజకుమార్తె కూడా బయలుదేరింది.

''మహారాజా, ప్రచండుణ్ణి పట్టుకున్నాను,'' అంటూ ప్రతాపుడు ప్రచండుణ్ణి చూపాడు. తన కుమార్తె తిరిగి దొరికినందుకు పరమానందం చెందిన రాజు ఈ మాటకు నిర్ఘాంతపోయి, ప్రచండుడి కేసి తిరిగి, ''ఎవరు నువ్వు?'' అని అడిగాడు.

''నా పేరు సూరన్న, మహారాజా. పారా, పలుగూ తీసుకుని పొట్ట పోసుకునేవాణ్ణి,'' అన్నాడు ప్రచండుడు.

''ఈ మనిషి ప్రచండు డన్నది అబద్ధం. ప్రచండుడు చచ్చిపోయాడని ఈ ప్రతాపుడే

నాతో అన్నాడు. నన్ను ఎత్తుకుపోయిన వాడు ప్రతాపుడు. నన్ను విడిపించ వచ్చిన వాడు ఈ సూరన్న," అన్నది రాజకుమార్తె.

"అది తప్పను. ఈ సూరన్నకు రేపే అర్ధరాజ్యం ఇచ్చేస్తాను. ఎవర్రా అక్కడ? రేపు విచారణ జరిగే దాకా ఈ ప్రతాపుణ్ణి ఖైదులో ఉంచండి," అన్నాడు రాజు.

భటులు ప్రతాపుణ్ణి పట్టుకుపోయారు.

అప్పుడు ప్రచండుడు రాజుతో, "మహారాజా, నాదొక విజ్ఞాపన. ప్రచండుణ్ణి పట్టుకున్న వారికి తమరు తమ కుమార్తె నిచ్చి పెళ్ళి చేస్తామన్న కారణంగా ఇలాటి అక్రమాలు జరుగుతున్నాయి. మీరా మాటను ఉపసంహరించి, రాజకుమార్తెను తన ఇష్టాను కూలంగా పెళ్లాడనిచ్చే పక్షంలో ఆ ప్రచండుడి ఆచూకీ నేను చెబుతాను. వాడు చావలేదు, దేశం విడిచి పోనూ లేదు," అన్నాడు.

"నిజమా? ఆ ప్రచండుడు ఎక్కడ ఉన్నాడు?" అని రాజు ఆత్రంగా అడిగాడు.

"నేనే ప్రచండుణ్ణి," అన్నాడు ప్రచండుడు వినయంగా.

రాజు నిర్ఘాంతపోయి, కొంచెం సేపు ఆలోచించి, "సరే, ఇక్కడే నీకు బస ఏర్పాటయింది. వెళ్ళి పడుకో," అన్నాడు.



మర్నాడు సభలో ప్రతాపుడి విచారణ జరిగింది. రాజు అతనికి యావజ్జీవ కారాగార శిక్ష విధించాడు. తరవాత ఆయన, రాజకుమార్తెను తనకు తిరిగి తెచ్చి ఇచ్చిన సూరన్న అనే అతనికి అర్ధరాజ్యం ఇచ్చి, తన కుమార్తెతో వివాహం జరపనున్నటు ప్రకటించాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, అంతా తనకు అనుకూలంగా అయినాక ప్రచండుడు తన రహస్యం బయటపెట్టి, తన పీక మీదికి వచ్చినంత పని ఎందుకు చేశాడు? అతన్ని పట్టి ఇచ్చిన ప్రతాపుడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చెయ్యటానికి

మారుగా రాజు ఆమెను ప్రచండుడికే ఎందుకు ఇచ్చి వేశాడు? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు సరిగానే ప్రవర్తించాడు. ప్రచండుణ్ణి పట్టి ఇచ్చిన ఘనత ప్రతాపుడికి దక్కరాదని రాజకుమార్తె మాటల వల్లనే వెల్లడయింది. ప్రచండుణ్ణి నిజంగా పట్టి ఇచ్చినవాడు ప్రచండుడే నని చెప్పాలి. అందుచేతనే రాజు తన కుమార్తెను అతనికి ఇచ్చి ఉండవచ్చు. లేదా, రాజకుమార్తె ఇచ్ఛానుసారం పెళ్ళి చెయ్యమని ప్రచండుడు రాజును కోరి ఉన్నాడు గనక, ప్రచండుణ్ణి పెళ్ళాడటం రాజకుమార్తె ఇచ్ఛ కూడా కావచ్చు. గజదొంగ అని ప్రచండుణ్ణి రాజు శిక్షించే అవకాశం లేదు. ఎందుచేతనంటే, రాజకుమార్తెను తెచ్చినందుకు అర్ధరాజ్యానికి ప్రచండుడు అర్హుడయాడు. ఏ రాజుగాని తన సాటిరాజును విచారణ చేసి శిక్షించ లేదు. ప్రచండుడు తనను తాను బయట పెట్టుకోవటానికి కారణం లేకపోలేదు. రాజుగారు తనను గురించి వివరాలు తెలుసుకోవటానికి తప్పక ప్రయత్నిస్తాడు. అప్పుడు అతని రహస్యం బయట పడవచ్చు. అదీగాక, ప్రచండుడు ఒక విధంగా రాజకుమార్తెను ప్రేమించినట్టే కనబడతాడు. లేకపోతే, ఆమెను ఎవరో ఎత్తుకుపోయినట్టు తెలియగానే ఆమె జాడ వెతుకుతూ బయలుదేరడు. అది కేవలమూ అర్ధరాజ్యం కోసమే అయితే తన రహస్యం బయటపెట్టే ముందు కొంచెం ఆలోచించేవాడే. అతను చాలావరకు రాజకుమార్తె సుఖం కోరే ఆ పని చేసినట్టు కనబడుతుంది," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# సింద్‌బాద్ అద్భుతయాత్రలు

సిండ్‌బాద్‌కు సముద్రయానాల మీద విముఖత కలిగింది. వయసు కూడా వచ్చేసింది. తన జీవితంలో పడదగిన కష్టాలన్నీ పడ్డాడు. వ్యాపారం ద్వారా అంతులేని సంపద పోగుచేసి, బాగ్దాదునగరంలో తనకు మించిన ధనికుడు లేడనిపించుకున్నాడు. ఖలీఫా స్నేహం సంపాదించుకున్నాడు. ఆయన అతన్ని అప్పుడప్పుడూ పిలిపించి అతని అనుభవాలు చెప్పించుకుని వింటున్నాడు. ఈ పరిస్థితులలో అతనికి దేశాటన చెయ్యాలనీ, ఏళ్ళతరబడి దేశాంతరాలలో అగచాట్లు పడాలనీ ఉత్సాహం కలగలేదు. ఇంటిపట్టునే ఉండాలనిపించింది.

అయితే తలవని తలంపుగా అతను మరొకసారి ప్రయాణం చెయ్యవలసి వచ్చింది. ఖలీఫా హరూనల్ రషీద్ అతన్ని పిలిపించి, ''సింద్‌బాద్, ఇథియోపియా రాజుకు సమాధానం పంపదలచాను. ఆయన కోసం కొన్ని కానుకలు కూడా సిద్ధం చేశాను. వాటిని నీ ద్వారానే పంపదలచాను. నిన్ను మళ్ళీ చూసి ఆయన ఎంతో సంతోషిస్తాడు. ఇవాళే నువు బయలుదేరి వెళ్ళాలి,'' అన్నాడు.

తనకు సముద్రయానం మీద ముఖం మొత్తిందని ఖలీఫాతో ఎలా చెప్పటం? తన అయిష్టాన్ని ఖలీఫాకు ఏమాత్రమూ తెలియనివ్వక, తాను ప్రయాణానికి సిద్ధంగా ఉన్నానన్నాడు సింద్‌బాద్.

ఖలీఫా దారిఖర్చుల కింద అతనికి పదివేల దీనారా లిచ్చాడు; ఇథియోపియా రాజుకు తాను పంపించే సమాధానమూ, బహుమానాలూ కూడా సింద్‌బాద్ పరం చేశాడు. ఖలీఫా పంపే బహుమానాలలో ఎర్ర మఖ్మల్ పరుపూ, మరి రెండు వేరే రంగుల మెత్తలూ, నూరు పట్టుతానులూ, తెల్ల

ఏడవ యాత్ర



కురువింద రత్నాలతో తయారుచేసిన కూజా, మేలుజాతి అరబ్బీ గుర్రాలూ ఉన్నాయి.

సిందబాద్ వీటన్నిటినీ తీసుకుని బస్రా చేరి, అక్కడ ఒక ఓడ పట్టుకున్నాడు. ఆ ఓడ ఇథియోపియా రాజుండే దీవి చేర టానికి మూడు మాసాలు పట్టింది. ఇథియో పియా రాజు, ఖలీఫా పంపిన లేఖా, కాను కలూ అందుకుని చాలా సంతోషించి, ఖలీఫా ఔదార్యాన్ని కొనియాడాడు. ఆయన సిందబాద్‌ను చాలాకాలం ఉండి పొమ్మ న్నాడు గాని, సిందబాద్ కొద్దిరోజులు మాత్రమే ఉండి, బస్రాకు తిరుగు ప్రయాణం కట్టాడు.





అతను ఎక్కిన వర్తకపు ఓడకు గాలి అనుకూలంగా ఉండటంచేత ప్రయాణం సుఖంగా సాగింది. దారిలో సీన్‌దీవి తగిలింది. అక్కడ వర్తకులు క్రయ విక్ర యాలు చేశారు. ఓడ ఆ దీవిని వదిలిన వారం రోజులకు పెద్ద వర్షాలు ఆరంభ మయాయి. సరుకులు తడిసి పోకుండా బేళ్ళ మీద కాన్వాసు కప్పారు.

ఓడ సరంగు తెరచాప స్తంభం ఎక్కి, చాలా సేపు అన్ని దిక్కులా పరీక్షించి చూశాడు. చివరకు అతను కిందికి దిగి వచ్చేసరికి అతని ముఖంలో రక్తం లేదు; అందరి కేసీ పిచ్చిగా చూస్తూ, నిశ్శబ్దంగా గడ్డం పీక్కుంటున్నాడు.

అందరూ అతని చుట్టూ మూగి, "ఏమిటి? ఏమిటి?" అని అడిగారు.

"అల్లాను ప్రార్థించండి. మనని అల్లా తప్ప ఎవరూ కాపాడలేరు. మనం తోవ తప్పి మారుమూల సముద్రం చేరాం!" అన్నా డతను.

తరవాత అతను ఒక పట్టు పొడుంపీల్చి ఏదో పుస్తకం తీసి అందులో చూసి, "అను కున్నంతా అయింది! ఆ కనిపించే తీరం భయంకరమైనది. ఈ సముద్రంలో ఓడ లను మింగేపాటి తిమింగిలా లున్నాయి.



ఆ తీరాన అతి భయంకరమైన జంతువులూ, మహాసర్పాలూ ఉన్నాయి. ఉన్న సంగతి చెప్పేశాను,'' అన్నాడు.

అతనామాట అంటూండగానే ఓడ ఇంత ఎత్తున లేచి, మళ్ళీ నీటిమీద పడింది. ప్రయాణీకుల గుండెలు క్షణంపాటు ఆగిపోయాయి. సముద్రమంతా తెర్లుతున్నది. నీటిని అలా చేస్తున్నవి మూడు తిమింగిలాలు. అవి కొండల్లాగా ఉన్నాయి. అవి ఓడను తరుముతూ వస్తున్నాయి.



ఒక తిమింగిలం తన నోటిని తెరిచి ఓడను అందుకున్నది. సింద్‌బాద్ నీటిలోకి దూకేశాడు. మరుక్షణం ఆ తిమింగిలం అతనుండిన ఓడను మింగేసింది! తరవాత మూడు తిమింగిలాలూ ఈదుకుంటూ తమ దారిన వెళ్ళిపోయాయి.

తిమింగిలం ఓడను మింగేటప్పుడు దాని పలక ఒకటి విరిగి నీటిలో పడింది. సింద్‌బాద్ దానిమీదికి ఎగబాకి, కాళ్లతోనూ, చేతులతోనూ నీటిని తోస్తూ, ఒక లంకను చేరుకున్నాడు. ఆ లంకలో పళ్లచెట్లు ఉన్నాయి. అతనికి అక్కడ ఒక నది కూడా కనిపించింది. అది వేగంగా ప్రవహిస్తున్నది.

ఆ నదే తనను కాపాడితే కాపాడాలనీ, లేకపోతే తన కిక భూమి మీద నూకలు చెల్లినట్టేననీ సింద్‌బాద్ అనుకున్నాడు. (కిందటిసారి నది ద్వారానే అతను రత్నాల దీవి నుంచి బయటబడ్డాడు.) అందుచేత అతను ఒక చెట్టు కొమ్మలు పోగుచేసి, దృఢమైన లతలతో వాటిని కలిపి కట్టి తెప్ప తయారు చేశాడు. తరవాత చెట్ల పళ్ళు కొన్ని తిని, మరికొన్ని తెప్ప మీద పేర్చుకుని, తెప్పతో సహా ప్రవాహంలోకి బారాడు. తెప్ప బాణం లాగా దూసుకుపోయింది. ఆ వేగానికి అతను పళ్ల కుప్ప మీదికి పడిపోయాడు.

పోయిన కొద్దీ నది వేగం హెచ్చుతున్నది. నీరు నురుగులు కక్కుతున్నది. దూరా





న్నుంచి హోరు విన వస్తున్నది. ముందుకు చూస్తే, అంత దూరాన నది అకస్మాత్తుగా అయి పోయినట్టు కనిపించింది. అక్కడ జలపాతం ఉన్నదనీ, ఆ జలపాతపు హోరే వినవస్తున్నదనీ సింద్‌బాద్ గ్రహించాడు. తాను తెప్పతో సహా ఆ జలపాతంలో పడి పోతాడు. అదే అతని ఆఖరుక్షణం! అతను మనసు భగవంతుడి మీద లగ్నం చేసి, కళ్ళు మూసుకుని, తెప్పను గట్టిగా కరుచుకుని పడుకున్నాడు.

తెప్ప జలపాతాన్ని చేరటమూ, పడి పోవటానికి ఒరగటమూ అతనికి తెలుసును. అయితే అలా ఒరిగిన తెప్ప, ఒరిగినట్టే ఉండిపోయింది; మరి కదలలేదు, కిందికి పడిపోలేదు.

ఆశ్చర్యంతో అతను కళ్ళు తెరిచి చూశాడు. అతన్ని, అతని తెప్పనూ ఒక వల పట్టేసింది. ఆ వలను విసిరినవాళ్ళు ఒడ్డున ఉన్నారు. వాళ్ళు వలను లాగి, అతన్ని తెప్పనూ ఒడ్డుకు చేర్చారు.

సింద్‌బాద్ చలికి వణుకుతూ, సగం చచ్చి ఒడ్డున పడుకుని ఉండగా, తెల్లని గడ్డం గల ఒక వృద్ధుడు అతన్ని దయగా పలకరించి, అతని మీద వెచ్చని బట్టలు కప్పాడు; అతని శరీరమంతా మృదువుగా మర్దన చేశాడు.

వృద్ధుడు చేసిన ఈ ఉపచారాలతో సింద్‌బాద్‌కు కాస్త బలం చేకూరింది. అతను లేచి కూర్చోగలిగాడు గాని మాట్లాడలేక పోయాడు. ఆ స్థితిలో అతన్ని వృద్ధుడు స్నానశాలకు తీసుకుపోయి, అతని శరీరాన్ని సుగంధ తైలాలతో మర్దన చేయించి, స్నానం అయాక తన ఇంటికి తీసుకుపోయి, తృప్తిగా భోజనం పెట్టించాడు. వృద్ధుడి ఇంట్లో అందరూ సింద్‌బాద్‌ను ఆప్యాయంగా చూశారు. వృద్ధుడు ఇంట్లో ఉన్నా లేక పోయినా, సింద్‌బాద్ అవసరాలు చూడటానికి బానిసలు హాజరుగా ఉండేవారు.

అతను ఆ వృద్ధుడి ఇంట మూడు రోజు లున్నాడు. కాని ఆ మూడు రోజులూ, వృద్ధుడు గాని, అతని వాళ్ళు గాని సింద్‌బాద్‌ను ఎలాటి ప్రశ్నలూ వెయ్యలేదు.

మూడు రోజులకు సింద్‌బాద్ తేరుకుని మామూలు మనిషి అయాడు. నాలుగో రోజున వృద్ధుడు సింద్‌బాద్‌తో, "మీకు ఏ లోపమూ కలగటం లేదు గద? అల్లా అనుగ్రహం వల్ల నేనా సమయానికి అక్కడ ఉండి మిమ్మల్ని ఆపద నుంచి కాపాడగలి గాను....ఇంతకూ మీ రెవరు? ఎక్కడ నుండి వస్తున్నారు?" అన్నాడు.

సింద్‌బాద్ ఆ వృద్ధుడికి తన కృతజ్ఞత తెలుపుకుని, తన కథ అంతా చెప్పేశాడు. తాను అనేకమార్లు సముద్రయానాలు చేసిన వర్తకుణ్ణని సింద్‌బాద్ చెప్పగానే, వృద్ధుడు, "అలా అయితే, మీ సరుకు వెంటనే అమ్మె య్యటం మంచిది. అది చాలా మేలురకం సరుకు. దానికి ఇక్కడ మంచి గిరాకీ ఉన్నది," అన్నాడు.

సింద్‌బాద్ ఆ మాట విని నిర్ఘాంత పోయాడు. వృద్ధుడు ఏ సరుకు గురించి మాట్లాడుతున్నదీ అతనికి అర్థం కాలేదు. అతను కట్టు బట్టలతో ఉన్నాడు. అతని వద్ద వర్తకపు సరుకు పూచికపుల్ల కూడా



లేదు. అయినా ఆ మాట పైకి అనక, సింద్‌బాద్ వృద్ధుడితో, "తొందరేం, చూతాం లెండి!" అన్నాడు.

"ఇంక జాప్యం దేనికి? అలా బజారుకు వెళ్ళి, మంచి ధర పలుకుతుందేమో విచా రింతాం. లేకపోతే వచ్చిన నష్టం లేదు. సరుకు నా గిడ్డంగిలోనే ఉంటుంది," అన్నాడు వృద్ధుడు.

"మీ ఇష్టం, బాబుగారూ. మీరేది చేస్తే నేను కాదంటాను గనక? నేను మీ చేతిలో వాణ్ణి. నాతో చెప్ప నవసరం కూడా లేదు, తోచినట్టు చేసెయ్యండి!" అన్నాడు సింద్‌బాద్.



ఇద్దరూ కలిసి బజారుకు వెళ్ళారు. అక్కడ తన తెప్ప ఉండటం చూసి సింద్‌బాద్ నిర్ఘాంతపోయాడు. ఆ తెప్పను వర్తకులూ, దళార్లూ పరీక్ష చేస్తున్నారు. "యా అల్లా! ఏమి అద్భుతమైన చందనం! ఇంత మంచి దినుసు ఎన్నడూ చూసి ఎరగను!" అంటున్నారెవరో.

తాను తెప్ప కట్టుకున్నది మేలు జాతి అగరుచందనం చెట్టుకొమ్మలని సింద్‌బాద్‌కు తెలిసి వచ్చింది. అతను పైకి గుంభనగా ఉండిపోయాడు.

ఆ తెప్ప కోసం వర్తకులు వేలం పాడారు. పాట వెయ్యి దీనారాలతో ఆరంభమై పది వేల దాకా పెరిగింది. వేలం వేసేవాడు సింద్‌బాద్ కేసి తిరిగి, "పదివేలకు కొట్టెయ్యమంటారా?" అని అడిగితే సింద్‌బాద్ వద్దన్నాడు.

కాని వృద్ధుడు అతనితో, "బాబూ, ఇంత కన్న ధర రాదు. కావలిస్తే నేనే మరో నూరు పెచ్చువేసి తీసుకుంటాను," అన్నాడు.

"మీరే తీసుకునేటట్టుంటే నేను కాదంటానా, బాబుగారూ?" అన్నాడు సింద్‌బాద్.

తెప్పను వృద్ధుడి గిడ్డంగికి ఆయన బానిసలు చేరవేశారు. వృద్ధుడు సింద్‌బాద్‌కు పదివేల ఒకవంద దీనారాలు పెట్టెలో పెట్టి ఇచ్చాడు. తరవాత ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేసేటప్పుడు వృద్ధుడు సింద్‌బాద్‌తో అన్నాడు:

"బాబూ, నాకు మగపిల్లలు లేరు. కాని బోలెడంత ఆస్తి ఉన్నది. చాలా పదవులు కూడా నిర్వహిస్తున్నాను. నా ఆస్తికంతా వారసురాలు నా కూతురు. దాన్ని పెళ్ళాడి నా ఆస్తికీ, హొదాలకూ వారసుడివవుతావా ఏమిటి?"

"బాబయ్యా, మీ మాట ఎలా కాదనేది?" అన్నాడు సింద్‌బాద్.

వెంటనే వృద్ధుడు కాదీనీ, సాక్షులనూ పిలిపించి సింద్‌బాద్‌కు తన కుమార్తె నిచ్చి



పెళ్ళి చేశాడు. ఆమె చాలా అందమైనది. ఆమె వంటిన అనేక వేల దీనారాల విలువ గల నగలు ఉన్నాయి. ఆమెతో అన్యోన్యంగా కాపరం చేస్తూ, మామగారికి వ్యాపారంలో సహాయపడుతూ సింద్‌బాద్ చాలా కాలం అక్కడే ఉండిపోయాడు.

కొంతకాలం గడిచాక, సింద్‌బాద్ మామగారైన వృద్ధుడు చనిపోయాడు. సింద్‌బాద్ ఆయనకు ఉత్తరక్రియలు ఆర్భాటంగా జరిపించాడు. మామగారి ఆస్తికి వారసుడై ఆ ప్రాంతానికి తానిప్పుడు ముఖ్యుడైనందున సింద్‌బాద్ అక్కడి ఆచారాలను మరింత శ్రద్ధగా పాటించవలసి వచ్చింది.

అతనిప్పుడు ఉన్న నగరంలో ఏటా ఒక వింత జరుగుతుంది. ప్రతి ఏడూ వసంత కాలంలో ఒక్కరోజున అక్కడి పురుషుల కందరికీ రెక్కలు వస్తాయి. ఆ రోజల్లా వారు గగన విహారం చేస్తారు. ఈ రెక్కలు స్త్రీలకూ, పిల్లలకూ రావు. వారు నగరంలోనే ఉండిపోతారు.

చిత్రమేమిటంటే, అందరు పురుషులకూ వచ్చే రెక్కలు సింద్‌బాద్‌కు రాలేదు. అందుచేత నగరంలోని పురుషులంతా గగన విహారం వెళ్ళిన నాడు అతను స్త్రీలతోనూ, పిల్లలతోనూ బాటు నగరంలో ఉండి



పోయాడు. తనకు రెక్కలు రాని కారణం ఎంతమంది నడిగిగా తెలియలేదు.

అందుచేత సింద్‌బాద్ తనకు రుణపడి ఉన్న ఒక వర్తకుడితో రహస్యంగా ఏర్పాటు చేసుకుని, ఆ వర్తకుడు రెక్కలతో ఆకాశంలో విహరించేనాడు అతని నడుము వాటేసుకుని తాను కూడా పైకి వెళ్ళాడు. ఆకాశంలోకి చాలా ఎత్తు వెళ్ళేసరికి, సింద్‌బాద్‌కు స్వర్గం చేరువలోనే ఉన్నట్టూ, అక్కడి గంధర్వుల గానం వినిపిస్తున్నట్టూ తోచింది.

"అల్లా! ఏమి నీ మహిమ!" అన్నాడు అతను ఆనందపారవశ్యంతో.

మరుక్షణమే సింద్‌బాద్ వర్తకుడితో సహా రాయిలాగా కిందికి దిగి రాసాగారు. అయితే అదృష్టవశాన వారొక కొండశిఖరాన క్షేమంగా దిగారు. వర్తకుడు సింద్‌బాద్ కేసి కోపంగా చూసి, తిరిగి ఆకాశంలోకి ఎగిరిపోయాడు.

తన గతి ఇలా అయిందేమని విచారిస్తుండగా ఇద్దరు కుర్రాళ్ళు సింద్‌బాద్ ఉన్న వేపు వచ్చారు. వారి చేతిలో బంగారు బెత్తాలున్నాయి. సింద్‌బాద్ వారిని పలకరించాడు, కాని వాళ్ళు జవాబు చెప్పలేదు. వారిలో ఒకడు సింద్‌బాద్‌కు తనవద్ద ఉన్న బెత్తం ఇచ్చి, ఫలాని దిక్కుగా వెళ్ళమన్నట్టు చెయ్యి చూపాడు. సింద్‌బాద్ అటుగా బయలుదేరి వెళ్ళి, ఒకచోట మనిషిని మింగుతున్న పామును చూశాడు. అతను చేతనున్న బెత్తంతో మెడమీద ఒక్కటి కొట్టేసరికి పాము చచ్చింది. దాని నోటి నుంచి మనిషిని వెలికి తీస్తే, అతను సింద్‌బాద్‌ను ఆకాశంలోకి తీసుకుపోయినవాడే.

"అయ్యా, మీరు నా ప్రాణం కాపాడారు. ఇంతకు ముందు జరిగినదానికి క్షమించాలి. మీరు ఒక పేరు ఉచ్చరించగానే నాలో ఎగిరేశక్తి పోయింది. మేమా పేరు ఉచ్చరించము!" అన్నాడతను.

"నేనూ ఉచ్చరించనులే. ముందు నన్ను మా ఇంటికి చేర్చు," అన్నాడు సింద్‌బాద్.

ఆ నగరంలో వాళ్ళు పిశాచగణాలకు పుట్టినవాళ్ళు. ఈ మాట సింద్‌బాద్ భార్య కూడా చెప్పింది. ఆమె కోరిక మీద అతను తన ఆస్తి అంతా అమ్మేసి సొమ్ము చేసుకుని, దానితో ఒక ఓడా కొంత సరుకూ కొని, భార్యతో సహా బాగ్దాదుకు వచ్చేశాడు.

అతన్ని చూసి అతని బంధుమిత్రులంతా చాలా సంతోషించారు. ఇక ఎన్నడూ ప్రయాణాలు చెయ్యనని అతను వారి వద్ద ప్రమాణం చేసి, యావజ్జీవం ఆ మాటమీదే ఉండిపోయాడు. —(అయిపోయింది)





# బెదిరిపోయిన దయ్యం

ఒక కట్టెలుకొట్టేవా డుండేవాడు. వాడి భార్య పిశాచిలాటిది. మొగుణ్ణి కుక్క కన్న హీనంగా చూసేది. వాడి సంపాదన అంతంత మాత్రంగా ఉంటే, అదంతా తాను కాజేసేది. వాడికి సరిగా తిండి అయినా పెట్టేది కాదు. "ఈ కూరలో ఉప్పు జాస్తి అయినట్టుందే?" అని వాడు ఏ పూట అయినా అంటే రెండో పూట అసలు ఉప్పే వేసేది కాదు.

ఇంత గయ్యాళితో వేగినంత కాలం వేగి ఆ నిర్భాగ్యుడు ఆత్మహత్య తప్ప తన కొక మార్గం లేదనుకున్నాడు. కాని ఉరిపోసు కోవటానికి తాడన్నా లేదు. కొందామంటే డబ్బులు లేవు. అందుచేత వాడు తను సంపాదించేదానిలో నుంచి ఏగానీ, డబ్బూ మిగిల్చి, దాన్ని ఒకచోట దాస్తూ వచ్చాడు. అయితే కొద్ది రోజులకే వాడి పెళ్ళాం దొంగను పట్టుకున్నది.

"ఈ డబ్బులన్నీ నీ కెక్కడివి? వీటిని ఎందుకు దాస్తున్నావు? స్నేహితులతో కలిసి తాగుదామనా?" అని అడిగింది పెళ్ళాం.

"అదేమీ లేదే! తాడు కొనుక్కొని ఉరి పోసుకుందామని!" అన్నాడు మొగుడు.

ఈ మాట వింటూనే ఆ గంపగయ్యాళి తన మొగుడి మీద అమ్మశక్తి లాగా పడి, రక్కి, పీకి, చాప చితకగొట్టేసింది.

ఇక లాభం లేదనుకుని కట్టెలు కొట్టే వాడు మర్నాడు తెల్లవారుఝామునే లేచి, అడవి కుండా కొండల కేసి బయలుదేరాడు.

అయితే మొగుడు బయలుదేరటం పెళ్ళాం చూసింది. చూసి, "వీడి ఎత్తు ఏమిటో చూడాలి!" అనుకుని, మొగుడి వెనకగా తానూ బయలుదేరింది.

పెళ్ళాం తనను వెంబడించటం గుర్తించి కట్టెలవాడు, "భగవంతుడా, నా కీ పీడ నుంచి విముక్తి లేదా?" అనుకున్నాడు.

పి. సత్యనారాయణ



వాడు ఒకచోట ఆగి, గొడ్డలి తీసి, కట్టెలు కొట్ట నారంభించాడు—ఆ పనిమీదే తాను బయలుదేరి వచ్చినట్టుగా.

వాడి పెళ్ళాం వాడికి కనబడే దూరంలోనే దేనికోసమో వెతుకుతున్నదాని లాగా ఆ పొదలోకీ, ఈ పొదలోకీ చూడసాగింది.

ఆమె ఒక పాడుపడిన నూతి కేసి నడుస్తూండటం అకస్మాత్తుగా మొగుడి కంట పడింది. ఆ నూతి మీద ఏవేవో తుప్పలూ, దుబ్బులూ పెరిగి ఉండటాన, కొత్తవాళ్ళకు నూయి కనిపించదు.

తన పెళ్ళాం పొరపాటున ఆ నూతిలో పడితే కట్టెలు కొట్టేవాడు పెద్దగా చింతించవలసిన అవసరం ఏమీ లేదు. అయినా వాడు వస్తుతః మంచివాడు కావటంచేత, ''అక్కడ పాడు నుయ్యి ఉన్నది, జాగర్త!'' అని కేక పెట్టాడు.

''నన్ను భయపెట్టి ఇంటికి పంపేసి, ఆ తరవాత ఏదో చేద్దామనుకుంటున్నాడు! నేనా మోసపొయ్యేదాన్ని?'' అనుకుంటూ కట్టెలు కొట్టేవాడి పెళ్ళాం మరి రెండడుగులు వేసి నూతిలో పడిపోయింది.

''నీ కర్మ! అనుభవించు!'' అనుకుని కట్టెలు కొట్టేవాడు తన గొడ్డలి తీసుకుని, ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి వాడు సుఖంగా నిద్రపోయాడు.

కాని మర్నాడు లేవగానే వాడి మనసు పీక నారంభించింది. ఎంత దుర్మార్గురాలు అయినా అది తన పెళ్ళాం; దాన్ని ఆ పాడు బావిలో నుంచి పైకి తీయటం తన ధర్మం అనుకుని వాడు అడవికి అడ్డంపడి పాడు బావి కేసి వెళ్ళాడు.

వాడు బావి దగ్గర మోకరించి, లోపలికి చూస్తే ఏమీ కనిపించలేదు. అలికిడి కూడా ఏమీ లేదు.

వాడు తన తలగుడ్డ తీసి బావిలోకి వదులుతూ, ''ఏమే, ఈ బట్ట గట్టిగా పట్టుకో, నిన్ను పైకి లాగుతాను,'' అన్నాడు.

దానికి జవాబు లేదు, కాని రెండు క్షణా లయాక తలగుడ్డ బరువెక్కింది. తన పెళ్ళాం ఇంత బరువా అని ఆశ్చర్యపోతూ కట్టెలవాడు తన తలగుడ్డను పైకి లాక్కో నారంభించాడు.

కాని తీరా చూస్తే పైకి వచ్చినది కట్టెల వాడి పెళ్ళాం కాదు—ఏదో భూతం! దాన్ని చూసి కట్టెలవాడు మూర్ఛపోయినంత పని చేశాడు.

భూతం వాణ్ణి చూసి, "భయపడకు! ఇవాళ నువు ఎంత పుణ్యం చేసుకున్నావో నీకు తెలీదు. నన్ను ఘోరమైన విపత్తు నుంచి కాపాడావు. నీ ఋణం ఎలాగైనా తీర్చుకుంటాను," అన్నది.

"ఋణం తీర్చటమా! నేను నీ కేం ఉప కారం చేశాను?" అన్నాడు కట్టెలవాడు కంగారుపడిపోతూ.

"ఇంకేం చెయ్యాలి? నే నీ బావిలో ఎన్నో ఏళ్ళుగా సుఖంగా, ప్రశాంతంగా జీవిస్తున్నాను. నిన్న ఒక భయంకరమైన ఆడది నాకు దాపరించింది. ఆ క్షణం నుంచీ నాకు శాంతి లేదు. దేవుడల్లే నువు వచ్చి నన్ను కాపాడావు. నీకు మంచి ఉప కారం చేస్తాను, నిజం! చూడూ, ఈ దేశపు రాజుగారికి అప్సరసలాటి కూతురున్నది.



ఆమెకు నేను పూనుతాను. రాజుగారు అర్థ మైన వైద్యులనూ, జ్యోతిష్కులనూ పిలి పిస్తాడు. వాళ్ళు భేషజాలైతే చేస్తారు గాని అందువల్ల ఫలితం ఉండదు. రాజుగారికి మతిపోయి ఉన్న సమయంలో నువు వచ్చి ఆమెకు పట్టిన దయ్యాన్ని వదలగొట్టు. అప్పుడు రాజుగారు నీకు గొప్ప బహుమానా లిస్తాడు," అన్నది భూతం.

"దయ్యాన్ని ఎలా వదలగొట్టను?" అని కట్టెలవాడు అడిగాడు.

"నువు రాగానే నేను పోతాను. నువ్వేదో మంత్రాలు చదివినట్టు నోరు ఆడించు," అన్నది భూతం.



కట్టెలు కొట్టేవాడు తన ఇంటికి బయలుదేరాడు. భూతం రాజుగారి ఇంటి కేసి వెళ్ళిపోయింది. కట్టెలవాడి భార్య గురించి ఎవరికీ పట్టలేదు.

క్షణాలమీద భూతం రాజభవనానికి చేరుకుని రాజకుమార్తెను ఆవహించింది. రాజకుమార్తె తన తలను రెండు చేతులతోనూ గట్టిగా పట్టుకుని, పెద్దగా అరిచి, విరుచుకు పడిపోయింది. దాసీలు ఆమెను శయ్యామీదికి చేర్చారు.

ఈ సంగతి రాజుకు తెలియగానే ఆయన ఆస్థానవైద్యులను పిలిపించి, వారి చేత చికిత్స చేయించాడు. వారిచ్చిన ఔషధాలేవీ పని చెయ్యలేదు. రాజు వైద్యులను వెళ్లగొట్టి మాంత్రికులను పిలిపించాడు.

మాంత్రికులు కూడా రాజకుమార్తెకు స్వస్థత కలిగించలేకపోయారు.

రాజు దైవజ్ఞులను కూడా పిలిపించాడు. వాళ్ళు పంచాంగాలు తిరగవేసి, రాశులూ, అంశలూ గుణించి, పూజలూ శాంతులూ జరిపించారు. కాని రాజకుమార్తెకు అందువల్ల ఏమీ మేలు జరగలేదు.

ఏ విధంగానూ తన కుమార్తె స్థితి బాగు కాకపోయేసరికి, రాజు, తన కుమార్తెకు సరి అయిన చికిత్స చేసినవాడికి ఆమెనిచ్చి పెళ్ళిచేసి, తన అనంతరం రాజును చేస్తానని చాటింపు వేయించాడు.

ఈ లోపల కట్టెలు కొట్టేవాడు తన ఇంట హాయిగా ఉంటున్నాడు. వాడి దారిద్ర్యం ఎప్పుడూ ఉన్నదే, కాని భార్యనుంచి విముక్తి పొందిన ఆనందంలో వాడు మునిగి తేలసాగాడు. భూతం గురించీ, అది రాజకుమార్తెను పట్టటం గురించీ, దాన్ని తాను వదిలించి రాజుగారి నుంచి బహుమానం పొందటం గురించీ వాడు పూర్తిగా మరిచిపోయాడు.

ఇంతలో వాడికి రాజుగారి చాటింపు వినవచ్చింది. అది వింటూనే వాడికి భూతం

చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. వెంటనే వాడు చాటింపు వేసేవాడి వద్దకు పరిగెత్తుకుంటూ వెళ్ళి, "రాజకుమార్తెకు నేను చికిత్స చేయగలను. ఆమెకు ప్రాణాపాయం కలగక ముందే నన్ను రాజభవనానికి తీసుకు పొండి!" అన్నాడు.



కట్టెలవాణ్ణి రాజభవనం చేర్చారు. ఈ పేదవాడు తన కుమార్తెకు చికిత్స చెయ్యటం అసంభవం అని రాజుకు అనిపించినా, ఆయన మనసులో కొంచెం ఆశ మొలకెత్తింది. "ఏ పుట్టలో ఏ పాముంటుందో!" అనుకున్నాడాయన.

కట్టెలవాడు రాజకుమార్తె ఉన్న గదిలోకి వెళ్ళాడు. నీరు తెప్పించి చేతులు కడుక్కుని, మంత్రాలు చదువుతున్నట్టు పెదవులు కదిలిస్తూ వాడు రాజకుమార్తె నుదుటినీ, చెంపలనూ నిమిరాడు.

మరుక్షణమే రాజకుమార్తె లేచి కూర్చుని చుట్టూ ఉన్నవారిని చూసి చిరునవ్వు నవ్వింది. ఆమె శరీరంలో ఎలాటి వ్యాధీ ఉన్నట్టు కనబడలేదు. ఇది చూసి రాజభవనంలో ఉన్న వారందరూ అమితంగా సంతోషించారు.

రాజుగారు అన్న మాట నిలబెట్టుకున్నాడు. ఆయన కట్టెలు కొట్టేవాడికి మంచి బట్టలూ, ఆభరణాలూ పెట్టి అలంకరించి, అతని గౌరవార్థమై గొప్ప విందు చేసి, తరవాత అతనికి తన కుమార్తె నిచ్చి వైభవంగా పెళ్ళి చేశాడు.

తన మొదటి భార్యతో కాపరం చేసిన కట్టెలవాడికి రాజకుమార్తెతో కాపరం చెయ్యటం స్వర్గంలో ఉన్నట్టుగా ఉన్నది.

రాజకుమార్తెను వదిలిపెట్టి పోయిన భూతం పొరుగు దేశపు రాజు కూతుర్ని పట్టింది. దానికి రాణివాసాలు చాలా సుఖంగా ఉన్నాయి.

పొరుగురాజు కూడా తన కుమార్తెకు రకరకాల చికిత్సలు చేయించి విఫలుడయాడు.

ఇంతలో ఆయనకు వార్త తెలిసింది—తన పొరుగున ఉన్న రాజు కూతురికి కూడా ఇలాగే జబ్బు చేస్తే ఎవరో వచ్చి రక్షించాడట; ఆ రాజు తన కుమార్తెను అతనికే ఇచ్చి పెళ్ళి చేశాడట.

వెంటనే ఆయన కట్టెలవాడి మామగారి దగ్గరకు ఒక దూతను పంపాడు. "దయచేసి మీ అల్లుణ్ణి పంపండి. అతను నా కుమార్తెకు చికిత్స చేసినట్టయితే, నా కుమార్తెను కూడా అతనికి రెండవ భార్యగా ఇచ్చి పెళ్ళి చేస్తాను," అని రాజుగారి మాటగా దూత తెలిపాడు.

మామగారి అనుమతితో కట్టెలవాడు పొరుగు రాజకుమార్తె వద్దకు వచ్చి, పూర్వంలాగే చేతులు కడుక్కుని, రాజకుమార్తె నుదురూ, చెంపలూ నిమిరాడు, మంత్రం చదువుతున్నట్టు పెదవులు కదపసాగాడు.

కాని భూతం వదిలిపోక కట్టెలవాడితో రహస్యంగా, "నువు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం ఇదివరకే చేశాను. నేనీ పిల్లను వదిలిపోను. పిచ్చి వేషాలు వేశావంటే నీ పెళ్ళాన్ని మళ్ళీపట్టి నీ రోగం కుదుర్చుతాను!" అని బెదిరించింది.

కట్టెలవాడు భూతంతో, "నా కీ పిల్లతో పనిలేదు. కావలిస్తే నా భార్యను కూడా తీసుకో. నేను వచ్చినది నా మొదటి భార్య నుంచి తప్పించుకోవటానికి. ఆ రాక్షసి ఎలాగో బావి నుంచి తప్పించుకుని నన్ను వెతుక్కుంటూ రాజభవనానికి వచ్చింది. ఇక్కడికి కూడా నా వెంటపడి వస్తున్నది!" అన్నాడు.

భూతం కట్టెలవాడి మాటలు పూర్తి కాకుండానే రాజకుమార్తెను వదిలి పారిపోయింది. అది ఎటు పోయినదీ, దాని సంగతి ఏమైనదీ విన్నవారు లేరు.

కట్టెలవాడు మాత్రం రెండో రాజకుమార్తెను కూడా పెళ్ళాడి, ఇద్దరు భార్యలతోనూ సుఖంగా ఉన్నాడు.





# కోడిగుడ్లవెల

ఒక యువకుడు బతుకుతెరువు కోసం తన గ్రామం నుంచి బయలుదేరి ఒకనాడు ఒక గ్రామం చేరుకున్నాడు. అతను ఒక పేదరాశి పెద్దమ్మ ఇంటికి వెళ్ళి, "పెద్దమ్మా, నన్ను ఆకలి దహించి వేస్తున్నది. చాలా దూరం నుంచి వస్తున్నాను. తినటానికి ఏమైనా పెట్టుదూ!" అన్నాడు.

"వేళగాని వేళ వచ్చావు. నా దగ్గిర ఆరు గుడ్లు మాత్రం ఉన్నాయి. అవి అట్లు వేసి ఇవ్వనా?" అన్నది పెద్దమ్మ.

దానికి యువకుడు సరేనన్నాడు. పెద్దమ్మ తన వద్ద ఉన్న ఆరుగుడ్లూ అట్లువేసి అతనికి పెట్టింది. వాటితో అతని ఆకలిబాధ కాస్తా తీరిపోయింది.

"గుడ్లకు ఏమివ్వమన్నావు, పెద్దమ్మా?" అన్నాడు యువకుడు.

"ఏమిస్తావు నాయనా? ఒక రాగిమాడ అవుతుంది," అన్నది పెద్దమ్మ.

"పెద్ద చిక్కే వచ్చి పడింది, పెద్దమ్మా. నా దగ్గిర బంగారుకాసు మాత్రం ఉన్నది. అది తీసుకుని చిల్లర ఇవ్వగలవా?" అన్నాడు యువకుడు.

"అంత చిల్లర నా దగ్గిర ఉంటుందా, నాయనా? కాస్త గుర్తుంచుకుని, తిరిగి ఇటుగా వచ్చేటప్పుడు ఇయ్యి పోనీ," అన్నది పెద్దమ్మ.

యువకుడు ముందుకు సాగిపోయాడు. అతను దేశాలు గడిచి, సముద్రాలు దాటి, ద్వీపాంతరాలకు వెళ్ళి, అక్కడ వర్తకం చేసి, చాలా డబ్బు గడించి, స్వదేశానికి తిరిగివస్తూ, అనేక సంవత్సరాల అనంతరం తిరిగి పేదరాశి పెద్దమ్మ ఉండే గ్రామం చేరి, ఆమెకు తాను బాకీ ఉన్న రాగిమాడ ఇవ్వబోయాడు.

పెద్దమ్మ గడుసుపిండం. యువకుడిప్పుడు గొప్ప ధనవంతుడని పసిగట్టి, "ఆ గుడ్ల

ఎల్. కాంతారావు

లెక్క అంత తేలిక కాదు, నాయనా!'' అన్నదామె.

యువకుడు ఆశ్చర్యపోయి, ''లెక్క ఏమిటి?'' అన్నాడు.

''నువు ఆ నాడు తిన్న ఆరు గుడ్లూ కొద్ది రోజుల్లో ఆరు కోళ్ళు అయి ఉండేవి. అవి మళ్ళీ గుడ్లు పెట్టేవి. ఆ గుడ్లు కోళ్ళు అయి ఉండేవి. అన్ని కోళ్ళూ మళ్ళీ గుడ్లు పెట్టేవి. ఇలా లెక్కచూస్తే నువు నాకు అయిదారు లక్షల గుడ్లకు డబ్బిచ్చు కోవలసి ఉంటుంది. సుమారుగా ఒక వెయ్యి బంగారుకాసు లిస్తే నా బాకీ తీరి పోతుంది,'' అన్నది పేదరాశి పెద్దమ్మ.

''నా దగ్గిర అంత డబ్బు లేదు,'' అన్నాడు యువకుడు.

పేదరాశి పెద్దమ్మ న్యాయాధికారి వద్దకు వెళ్ళి, యువకుడు తనకు వెయ్యి బంగారు కాసులు బాకీ ఉన్నట్టూ, అతను ఆ బాకీ తీర్చ నిరాకరిస్తున్నట్టూ ఫిర్యాదు చేసింది.

న్యాయాధికారి రక్షకభటులను పంపి, యువకుణ్ణి పట్టి తెప్పించి, నిర్బంధంలో ఉంచి, మర్నాడు విచారణ చేస్తానని చెప్పాడు.

మర్నాడు యువకుడు న్యాయస్థానానికి రాగానే ఒక కుర్రవాడు అతన్ని సమీపించి, ''అయ్యా, నేను కొత్తగా న్యాయశాస్త్రం చది



వాను. మీ తరఫున వాదించడానికి ఎవరూ లేరు గనక ఆ పని చేసే అవకాశం నాకు ఇప్పించండి." అన్నాడు.

యువకుడు ఆశ్చర్యపడి, తన కేమీ అభ్యంతరం లేదన్నాడు. న్యాయాధికారి ఫిర్యాదినీ, ముద్దాయినీ పిలిచాడు.

పేదరాసి పెద్దమ్మ న్యాయస్థానంలో హాజరుగానే వున్నది. యువకుణ్ణి భటులు ముందుకు తెచ్చారు.

న్యాయశాస్త్రం చదివిన కుర్రవాడు న్యాయాధికారిని సమీపించి, "తమరు ఈ విచారణ కొద్దిగా వాయిదా వేయాలని నా మనవి. నేను ముద్దాయి పక్షాన వాదించబోతున్నాను. కాని అతనితో వివరంగా మాట్లాడటానికి నాకు వ్యవధి చిక్కలేదు," అని చెప్పాడు.

"నిన్న సాయంకాల మంతా ఏం చేస్తున్నావు?" అని న్యాయాధికారి కోపంగా అడిగాడు.

"తమరు నన్ను మన్నించాలి. నేను నిన్న నల్లా వేరుశనగ నాటటానికని విత్తులు వేయించుతూ పొలంలోనే ఉండిపోయాను," అన్నాడు కుర్రవాడు.

"అదేం బుద్ధిలేని మాట! నాటే వేరుశనగవిత్తులను ఎవరైనా వేయించుకుంటారా? వేపిన విత్తులు ఎక్కడన్నా మొలకెత్తుతాయా?" అన్నది పేదరాసి పెద్దమ్మ.

కుర్రవాడు ఆమె కేసి ఆశ్చర్యంగా చూసి, "అట్లు వేసిన కోడిగుడ్లు పిల్లలై తరతరాలుగా గుడ్లు పెట్టగా లేనిది వేయించిన విత్తులు మొలకెత్తటం అబ్బురమా?" అన్నాడు.

న్యాయాధికారికి విషయం బోధపడిపోయింది. పేదరాసి పెద్దమ్మ తెచ్చిన ఫిర్యాదును ఆయన కొట్టిపారేశాడు. యువకుడు తన పక్షాన వాదించిన కుర్రవాడికి మంచి బహుమానం ఇచ్చి, తన గ్రామానికి వెళ్ళిపోయాడు.






పరిగత పరమార్థాన్ పండితాన్ మావమంస్థాః,
తృణమివ లఘు లక్ష్మీ ర్నైవ తాన్ సంరుణద్ధి;
అభినవమదరేఖాశ్యామగండస్థలానాం
న భవతి బిసతంతు ర్వారణం వారణానామ్ 1.

[జ్ఞానులైన పండితులను అవమానించకు. నీ సంపద వారికి గడ్డిపోచతో సమానం. మదించిన ఏనుగులను తామరతూళ్ళతో బంధించటం ఎలాసాధ్యం?]

అంభోజినీవనవిహారవిలాస మేవ
హంసస్య హంతు నితరాం కుపితో విధాతా,
న త్వస్య దుగ్ధజలభేదవిధౌ ప్రసిద్ధాం
వైదగ్ధ్యకీర్తి మపహర్తు మసౌ సమర్థః 2.

[బ్రహ్మదేవుడు హంస మీద అలిగితే దాన్ని తామరకొలనులలో విహరించకుండా శాసించగలడు గాని, పాలనూ నీటినీ వేరు చేయటంలో దానికిగల శక్తిని తీసివేయగలడా?]

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయం 3.

[గొప్ప రచనలు చేసి, రససిద్ధులైన కవులు సంపాదించుకునే యశస్సు అనే శరీరాలకు వార్ధక్యమూ, మరణమూ అనేవి ఉండవు.]

విద్వాంసులు



# గజదొంగ

ఒకనాడు ఒక వ్యాపారి ఒక నగరానికి వర్తకం మీద వచ్చి, తాను తెచ్చిన సరుకంతా అమ్మేసి, విక్రయ ధనం వెయ్యి రూపాయలు మూట కట్టుకుని, ఆ రాత్రి ఒక సత్రం గదిలో పడుకున్నాడు.

ఆ వ్యాపారి మర్నాడు ఉదయం లేచి చూసుకుంటే డబ్బు మూట లేదు. వెంటనే అతను సత్రం యజమానికి ఈ సంగతి తెలిపాడు.

సత్రం యజమాని సత్రంలో బస చేసిన వారందరినీ ఒక చోట చేర్చి, అందరి సామాన్లూ సోదా చెయ్యమని నౌకర్లను ఆజ్ఞాపించాడు.

ఆ సమయంలో ఒక పెద్ద మీసాలవాడు, తలకొక గుడ్డ చుట్టుకుని, ఒక మూట తీసుకు వచ్చి వ్యాపారి కాళ్ళ దగ్గిర పెట్టి, "ఇదుగో మీ డబ్బు మూట. మీ సొమ్ము సరిగా ఉన్నదో, లేదో చూసుకోండి. దీన్ని దొంగిలించిన వాణ్ణి నేనే. నా కారణంగా ఈ పెద్ద మనుషులందరూ అవమానానికి గురి కావటం సహించలేక పట్టుపడి పోదామని వచ్చాను,'' అన్నాడు.

ఈ మాటకు వ్యాపారి ఆనందించి, మూట విప్పి, డబ్బు ఎంచి చూసుకుని, "డబ్బంతా సరిగానే ఉన్నది. ఇంతకూ నువు మామూలు దొంగవు కానట్టున్నావు. దొంగ ఎవడూ ఇలా చెయ్యడు. ఇందు బహుమానం!'' అంటూ కొంత డబ్బు వాడి కివ్వబోయాడు.

వాడు దాన్ని స్వీకరించక, ''దొంగ దండనకు అర్హుడుగాని, బహుమానానికి అర్హుడు కాడు. ఇంతకూ నేని దొంగతనం ఎలా చేశానో చెబితే మీ కందరికీ హెచ్చరికగా ఉంటుంది. మీరు మీ సరుకంతా అమ్మేసి సొమ్ము చేసుకుని బయలు దేరగానే నేను మీ వెనకే వచ్చాను. మీరు సత్రంలో గది ఏర్పాటు చేసుకునేటప్పుడు

సి. ఆంజనేయశర్మ



నిజానికి వాడు మామూలు చీకటి దొంగ కాదు, గజదొంగ. వాడు నలుగురూ చూస్తూండగానే దొంగతనం చేస్తాడు.

ఈ గజదొంగ కింద ఒక శిష్యుడుండే వాడు. వాడు తన గురువుకు సహాయకుడుగా కూడా ఉండే వాడు. ఈ శిష్యుడు ఒక సారి ఒక ధనికుణ్ణి వెంబడించాడు. ఆ ధనికుడి చేతిలో ఒక పసుపురంగు సంచీ ఉన్నది. ఆ సంచీలో బంగారు నాణాలున్నాయి. వాటిని ధనికుడు ఎంచి సంచీలో పోసుకోవటం చూసి దొంగ ఆయనను వెంబడించాడు.

మీది ఫలానా గది అని తెలియగానే అందులో ప్రవేశించి, మంచం కింద దూరాను. మీరు పడుకుని గురకపెట్టటం మొదలు పెట్టగానే, ఇలా పాకుతూ వచ్చి, మూట చప్పుడు కాకుండా ఇలా పట్టుకుని, ఈ వెనక ఉన్న చీకటి గదిలోకి పారిపోయాను—'' అంటూ, వ్యాపారి మూటను తీసుకుని వెనక ఉండే గదిలోకి పరిగెత్తి, వెనక ఉన్న గోడ దూకి, లాఘవంగా అడవిలోకి మాయమయాడు!

దొంగ ఉద్దేశమేమిటో తెలియక, వాడు మళ్ళీ వస్తాడని చూస్తున్న వారందరికీ వాడి ఎత్తు అర్థమయే సరికి వాడి జాడ ఏ మాత్రమూ లేదు.

ఆ ధనికుడు ఇంటికి వచ్చి, సంచీని లోపల పెట్టమని తన నౌకరు కిచ్చి, వాణ్ణి చెంబుతో నీరు తెమ్మన్నాడు. నౌకరు సంచీని లోపల బల్లమీద పెట్టి, యజమానికి చెంబుతో నీళ్ళు తెచ్చి ఇచ్చి, ఆయనకు ఫలహారం తీసుకురావటానికి మళ్ళీ లోపలికి వెళ్ళాడు. యజమాని కొబ్బరిచెట్టు దగ్గిర కాళ్ళు కడుక్కునే సమయంలో దొంగ చల్లగా లోపల ప్రవేశించి, బల్లమీద సంచీ సంగ్రహించి, శీఘ్రంగా అడవి చేరి, తన గురువుకు సంచీ ఇచ్చి, తాను దాన్ని ఎలా సంగ్రహించినదీ చెప్పాడు.

"ఒరే, చాలా తప్పుపని చేశావు. సంచీ పోవటం కనిపెట్టి ఆ ధనికుడు తన నౌకరును

శంకించి, హింస పెడతాడు. మన వల్ల ఎవ రికీ హాని రాకూడదు," అన్నాడు గజదొంగ.

"పొరపాటు జరిగింది. ఇప్పుడే వెళ్ళి ఆ నౌకరు బాధపడకుండా చూస్తాను." అంటూ శిష్యుడు పసుపురంగు సంచీ తీసు కుని ధనికుడి ఇంటికి వచ్చాడు. ధనికుడు తన నౌకరును వసారాగుంజకు కట్టి, "ఆ సంచీ ఏం చేశావో చెప్పకపోతే నిన్ను వాతలు పెట్టి చంపేస్తాను! చెప్పు!" అని భీకరంగా బెదిరిస్తున్నాడు.

"నే నే పాపమూ ఎరగను, బాబో!" అని నౌకరు ఏడుస్తున్నాడు.

ఇంతలో గజదొంగ శిష్యుడు, "అయ్యా!" అని పిలిచాడు.

"ఎవరూ ?" అంటూ ధనికుడు బయటి వేపు చూశాడు.

గజదొంగ శిష్యుడు పసుపురంగు సంచీ ధనికుడి ముందుపెట్టి, "నేను సుభానుగారి పనిమనిషినండి. మీ రింతకు ముందు వారింటికివచ్చి, వారితో మాట్లాడుతూ ఈ సంచీ అక్కడ పెట్టి మరిచిపోయారండి. సుభానుగారు ఈ సంచీ తమ కివ్వమన్నా రండి. వస్తానండి," అంటూ వెళ్ళిపోయాడు.

ధనికుడు ఇంటికి వస్తూ సుభానుగారిం టికి వెళ్ళిన మాట నిజమే. కాని సంచీ ఇంటికి తెచ్చినట్టు అయనకు బాగా గుర్తు న్నది. ఆయన నౌకరు కట్లు విప్పుతూ, "ఈ సంచీని నేనసలు ఇంటికే తీసుకు రాకపోతే, బల్లమీద పెట్టానని ఎలా అన్నా వురా ?" అని అడిగాడు.

"మీ రిచ్చానని గట్టిగా చెబుతుంటే నేను బల్లమీద పెట్టాను కాబోలు ననుకున్నా నండి," అన్నాడు నౌకరు.

కాని తరవాత ధనికుడు తన సంచీ విప్పి చూసుకుంటే అందులో ఉన్నవి బంగారు నాణాలు కావు—చిళ్ళపెంకులు! విచారిం చగా సుభానుగారికి అలాటి నౌకరు లేనట్టు తేలింది.





# సామాన్యమైన ప్రశ్నలు

ఒక గ్రామంలో ఒక ధనికుడు ఉండేవాడు. ఆయనకు ఒకతే కుమార్తె. ఆ ధనికుడి వద్ద ఒక దిక్కులేని కుర్రవాడు ఉండేవాడు. చిన్నతనం నుంచీ వాడు ఆ ధనికుడి ఇంటనే పెరిగి, పశువులను కాస్తూ ఉండేవాడు. చదువు సంధ్యలు లేకపోయినా, వాడు సూక్ష్మబుద్ధి గలవాడు. మంచి మాటకారి. వాడి పేరు రాముడు.

ధనికుడి కూతురు జానకి రాముడి కన్న కాస్త చిన్నది. కాని ఆమెకు తన యీడు వాళ్ళు మరెవ్వరూ లేని కారణం చేత అస్తమానమూ వాడి కబుర్లు వింటూ, వాడికి బాగా మాలిమి అయింది.

రాముడూ, జానకీ పెరిగి పెద్దవాళ్ళయే కొద్దీ వారి మధ్య ఉన్న ఆప్యాయత ఆపేక్షగానూ, ఇంకా ముదిరి ప్రేమగానూ పరిణమించింది. వాళ్ళు పెళ్ళాడదామనే నిర్ణయానికి కూడా వచ్చేశారు.

ఈ స్థితిలో ధనికుడికి అసలు సంగతి కాస్తా తెలిసిపోయింది. తన మంచితనం తన కొంపకే ఎసరు తెచ్చిందనీ, తానిచ్చిన అలుసుతో రాముడు తన కూతురి మనసు దొంగిలించ జూస్తున్నాడనీ ఆగ్రహించి ఆయన రాముణ్ణి చావగొట్టబోయాడు. కాని జానకి తండ్రికి అడ్డువచ్చి, "వాడు చేసిన తప్పేముంది? నాకీ ప్రపంచంలో వాడి కన్న ఇష్టమైనవాడు మరొకడు లేడు. నేను వాణ్ణి తప్ప మరొకరిని పెళ్ళాడను. కావలిస్తే నన్నే చావగొట్టండి." అన్నది.

రాముణ్ణి తన చూరు కింద ఇంక ఉండ నివ్వరాదని నిశ్చయించుకుని యజమాని వాడితో, "ఒరే, నిన్ను పామును పాలుపోసి పెంచినట్టు పెంచాను. నా కూతురు మూర్ఖురాలు. నువు నిజంగా నా అల్లుడివి కావాలంటే ధనమూ, కీర్తి కూడా సంపాదించాలి. అవి రెండూ సంపాదించుకు రావటానికి నీకు

డి. పూర్ణచంద్రరావు

ఏడాది గడు విచ్చాను. ఈ క్షణమే యిక్కణ్ణించి వెళ్ళిపో!'' అన్నాడు.

జానకి ఏడిచింది. రాముడు ఊరు వదిలి వెళ్ళిపోయాడు. గ్రామాలలో ఉండే వాళ్ళకు ధనమూ, కీర్తి ప్రతిష్ఠలూ రావు. అందు చేత వాడు తిన్నగా రాజధాని నగరం చేరాడు.

రాముడు రాజధాని చేరేసరికి అక్కడ పండిత సభలు జరుగుతున్నాయి. రాజు గారు ఏటా మూడు రోజులపాటు పండిత పరిషత్సభలూ, పోటీలూ జరిపి, ఆ పోటీ లలో అందరినీ మించిన వారికి గొప్ప సన్మానమూ, సత్కారమూ చేస్తారు. వాటికి అందరూ రావచ్చు.

ఈ ఏడు ఒక వింత జరిగింది. సభ మూడు రోజుల నుంచీ జరుగుతున్నప్పటికీ ఏ పండితుడూ మరొక పండితుణ్ణి ఓడించట మన్నది జరగలేదు.

సాయంకాలంలోపల ఎవరో ఒకరు విజయం సాధించాలి. రాజుగారు ఎంత ప్రోత్సహించినా పండితుల పస అయి పోయినట్టు కనిపించింది. వారు వేసే ప్రశ్నలు రానురాను నీరసంగా పరిణ మించి, చివరకు అయిపోయాయి.

రాజుగారు హతాశుడై, ''ప్రేక్షకులలో కూడా ఎవరన్నా ప్రశ్నలు వేయవచ్చు.'' అన్నాడు. పండితులే వట్టిపోయాక సామాన్యు



లవల్ల ఏమవుతుంది? అందుచేత చాలాసేపు ఎవరూ నోరు మెదపలేదు. కాని మాటకారి అయిన రాముడు ఊరుకోలేక, "మహా రాజా, నేను మామూలు మనిషిని. తమ సెలవైతే మామూలు ప్రశ్నలు వెయ్యగలను!" అన్నాడు. రాజు అనుమతించాడు.

"ఒక దారిన రెండు వైపుల నుంచీ ఇద్దరు మనుషులు వస్తూంటారు; వారు ఒకరికొకరు ఏమవుతారు? వాళ్ళు కలుసుకున్నప్పుడేమవుతారు? ఒకరినొకరు దాటిపోయాక ఏమవుతారు?" అని రాముడు అడిగాడు.

ఈ ప్రశ్నలు విని పండితులు నిర్ఘాంత పోయారు. ఇవి పిచ్చి ప్రశ్నలని కొందరు ఆక్షేపణ తెలిపారు. రాజుగారికి కూడా అలాగే అనిపించింది. ఆ ప్రశ్నలకు పండితులు సమాధానాలు చెప్పటానికి సిద్ధంగా లేరని రూఢి చేసుకుని, రాజుగారు రాముడితో, "ప్రశ్నలు వెయ్యగానే సరికాదు. వాటికి నువు సమాధానాలు చెబితేనే గెలిచినట్టు! లేకపోతే నిన్ను తీవ్రంగా శిక్షించగలను," అన్నాడు.

రాముడు చిరునవ్వు నవ్వి, "నే నడిగిన ప్రశ్నలు చాలా తేలికైనవి, మహారాజా! ఒక దారిలో రెండు వైపుల నుంచి వచ్చేవాళ్ళు ఒకరికొకరు ఎదురవుతారు; కలుసుకున్నాక దగ్గిర అవుతారు; ఒకరినొకరు దాటిపోయాక దూరమవుతారు!" అన్నాడు.

సభలో అందరూ గొల్లున నవ్వారు. రాజుగారు రాముడి సహజయుక్తికి సంతోషించి, ఆ యేడు పండిత పరిషత్తులో వాడికే విజయం చేకూరినట్టు ప్రకటించి, వాడికి సన్మానమూ, సత్కారాలూ చేసి పంపాడు.

రాముడు తన గ్రామానికి తిరిగివచ్చి జరిగినదంతా తన యజమానికి చెప్పాడు. వాడు వెళ్ళినది మొదలు తన కుమార్తెను పట్టుకున్న దిగులు కళ్ళారా చూసిన ధనికుడు రాముడికీ, జానకికీ పెళ్ళి చేసేశాడు.





# మహాభారతం

బ్రాహ్మణుడు పాండవు లున్న చోటికి వచ్చి, "మా రాజుగారు మీ వృత్తాంతమంతా తెలుసుకుని రమ్మని నన్ను పంపాడు. మా రాజుగారు పాండు మహారాజుకు స్నేహితుడు; తన కుమార్తెను అర్జునుడి కిచ్చి పెళ్ళి చెయ్యాలని కలలుగన్నాడు. అందుచేత మీ కులగోత్ర నామాలు తెలిపి, సంతోషం కలిగించండి," అని అడిగాడు.

ధర్మరాజు ఆ బ్రాహ్మణుడికి అతిథి సత్కారాలు జరిపి; కూర్చొబెట్టి, "మీ రాజుగారికి మా కులగోత్రనామాలతో ఏం పని? మత్స్యయంత్రం కొట్టినవారికి తన కుమార్తె నిస్తానన్నాడు. మా వాడు ఆ పని చేసి పిల్లను గెలుచుకున్నాడు. మీ రాజు కోరిక నెరవేరిందని అనుకుంటున్నాను," అన్నాడు.

ఇంతలో ద్రుపదుడు పాండవులను తీసుకురమ్మని పంపిన రథాలు వచ్చాయి. పాండవు లందరూ వేరువేరు రథాలలో ఎక్కారు. కుంతీ ద్రౌపదీ ఒక రథంలో ఎక్కారు. రథాలు రాజనగరు చేరాయి. ద్రుపదుడు వారి కోసం రకరకాల కానుకలు పంపాడు, అయితే పాండవులు క్షత్రియోచితమైనవే గ్రహించి, మిగిలినవి వదిలేశారు. తరవాత ద్రుపదుడు వారిని కళ్ళారా చూసి, నిశ్చయంగా క్షత్రియులేనని రూఢి చేసుకున్నాడు.

ఒక మంటపంలో సమావేశం జరిగింది. అక్కడ ద్రుపదుడు ధర్మరాజు కేసి తిరిగి, "అయ్యా, మీ రెవరో మాకు తెలియలేదు. మీ రెవరో తెలిస్తేనే గాని మా పిల్లను

15. ద్రౌపదీవివాహం



కొద్ది రోజులయాక ద్రుపదుడు పాండవులతో, మంచి శుభముహూర్తం చూసి ద్రౌపదికీ, అర్జునుడికీ త్వరలో వివాహం ఏర్పాటు చేస్తానన్నాడు.

"అది ఎలా వీలవుతుంది? అర్జునుడి కన్న పెద్దవాళ్ళం నేనూ, భీముడూ ఇంకా అవివాహితులం," అన్నాడు ధర్మరాజు.

"అలా అయితే మా కృష్ణను నీకే ఇచ్చి చేస్తాను," అన్నాడు ద్రుపదుడు.

"మీ కుమార్తె రత్నం లాంటిది. రత్నాన్ని అందరూ అనుభవించవచ్చును. మా అమ్మ నోట వచ్చిన మాటను బట్టి మేము అయిదుగురమూ ఆమెను పెళ్ళాడతాము," అన్నాడు ధర్మరాజు.

ఈ మాటకు ద్రుపదుడు నివ్వెరపోయి, "ఒక పురుషుడు అనేకమంది భార్యలను పెళ్ళాడవచ్చును గాని, ఒక స్త్రీ అనేక మంది భర్తలను వివాహం చేసుకోవటం ఎక్కడన్నా కద్దా? దీని విషయమై రేపు మవూ, నేనూ, కుంతీదేవీ, మా ధృష్టద్యుమ్నుడూ కలిసి చర్చించి, ఏదో ఒకటి నిశ్చయించుకుందాం," అని ద్రుపదుడు అప్పటికి చర్చ కట్టిపెట్టాడు.

శాస్త్రోక్తంగా వివాహం చెయ్యటం సాధ్యం కాదు," అన్నాడు.

అప్పుడు ధర్మరాజు నిజం చెప్పేశాడు. ద్రౌపదిని గెలుచుకున్నవాడు అర్జునుడేనని తెలియగానే ద్రుపదుడి కంట ఆనంద బాష్పాలు రాలాయి. "మీరు లక్కయింట చనిపోకుండా తప్పించుకోవటం నా అదృష్టం. మీకు మీ రాజ్యం తిరిగి సంపాదించి పెడతానని ప్రతిజ్ఞ చేస్తున్నాను," అన్నాడాయన.

కుంతీదేవీ, పాండవులూ, ద్రౌపదీ ఉండటానికి మంచి భవనం ఒకటి ఏర్పాటయింది. అందులో వాళ్ళకు సుఖంగా జరుగుతున్నది.

ఆ సమయానికి నల్లజింకతోలు ధరించి కృష్ణద్వైపాయనుడు అక్కడికి వచ్చాడు.





అందరూ ఆయనకు ఎదురు వెళ్ళి, పూజించి, తీసుకు వచ్చి ఉచితాసనం మీద కూర్చో బెట్టి, తాము కూడా కూర్చున్నారు.

ఆ సభలో ద్రుపదుడు కృష్ణద్వైపాయనుడితో, "మహాత్మా, అన్ని ధర్మాలూ తెలిసినవాడై ఉండి కూడా ఈ ధర్మరాజు, నా కుమార్తెను తాము అన్నదమ్ములు అయిదుగురూ పెళ్ళాడాలంటున్నాడు. మీకు తెలియని విషయాలుండవు. ఏ యుగంలో నైనా అనేకమంది పురుషులు ఒక్కస్త్రీని పెళ్ళాడినది కద్దా? అది ధర్మ విరుద్ధం కాదా?" అన్నాడు.

వెంటనే ధర్మరాజు, "అధర్మం నా నోట ఎన్నడూ రాదు. మేమందరమూ ఈమెను పెళ్ళాడతామన్నప్పుడు మీరు నిశ్చింతగా ఆ పని చెయ్యవచ్చును. మా కందరికీ ఈమె పైన మనసు పోయింది. అదీగాక మా తల్లి ఆజ్ఞ అయింది. తల్లి ఆజ్ఞ పాలించటం కన్న ఉత్తమ ధర్మమేమున్నది? పూర్వాచారాల మాటకు వస్తే, గౌతమ వంశంలో పుట్టిన జటిల అనే మునికన్య ఏడుగురికి భార్య అయింది. దాక్షాయణి అనే మునికన్య ప్రచేతసు లనే మునులు పదిమందికి భార్య అయింది. ఇవి పురాణాలలో మనం విన్నవే." అన్నాడు.

ధృష్టద్యుమ్నుడు మరొక రకం అభ్యంతరం లేవదీశాడు: తమ్ముడైన అర్జునుడు స్వశక్తితో గెలుచుకున్న కన్యను అన్న అయిన ధర్మరాజు ఎలా పెళ్ళాడతాడు? కృష్ణ ఇంతమందికి ఎలా భార్య అవుతుంది?

కుంతి తన మాట అబద్ధం కారాదని పట్టుపట్టింది.

కృష్ణద్వైపాయనుడు కుంతికి ధైర్యం చెప్పి, ద్రుపదుడితో, "రాజా, ధర్మరాజు చెప్పినది అధర్మం కాదు. కుంతి కోరికా తప్పు కాదు. ఈ అయిదుగురు అన్నదమ్ములకూ నీ కుమార్తె నిచ్చి వివాహం చెయ్యి." అన్నాడు.



తరవాత ఆయన ద్రుపదుణ్ణి ఏకాంతంగా తీసుకుపోయి, ద్రౌపది పూర్వ జన్మల వృత్తాంతం ఈ విధంగా చెప్పాడు:

పూర్వం మౌద్గల్యు డనే మునికి ఇంద్రసేన అనే భార్య ఉండేది. మౌద్గల్యుడికి కుష్ఠవ్యాధి సోకటం చేత ఆమెకు భర్త నుంచి ఎలాటి సుఖమూ లేకుండా పోయింది. ఆమె భర్త కోసం కలవరిస్తూ చనిపోయి, మరొక జన్మలో కాశీరాజు కుమార్తెగా పుట్టింది. ఆ జన్మలో ఆమె ఎంతో సౌందర్యవతి. అయినా ఆమెకు భర్త దొరకలేదు. అందుకామె చాలా దుఃఖించి, పరమేశ్వరుణ్ణి గురించి తీవ్రమైన తపస్సు చేయనారంభించింది. కొంతకాలానికి పరమేశ్వరుడు ఆమె ఎదట ప్రత్యక్షమై, "ఏమి కోరి తపస్సు చేస్తున్నావు? నీ కేమి కావాలో కోరుకో," అన్నాడు.

ఆమె ఆత్రంగా, "పతి, పతి, పతి, పతి, పతి!" అని అయిదుమార్లు అన్నది.

"నీకు వచ్చే జన్మలో అయిదుగురు మహాపురుషులు భర్తలు కాగలరు," అన్నాడు మహేశ్వరుడు.

తనకు అయిదుగురు భర్తలయేటట్టుంటే, తాను అందరికీ సమంగా సేవలు చేస్తూ, అందరినీ సమంగా సుఖపెట్టేటట్టు అనుగ్రహించమని కాశీరాజు కూతురు మహేశ్వరుణ్ణి వేడింది.

ఆమె ఇప్పుడు ద్రౌపదిగా పుట్టి, పూర్వజన్మలో పరమేశ్వరు డిచ్చిన వరాన్ని అనుసరించి పాండవు లయిదుగురికీ భార్య కానున్నది.

ఈ సంగతి చెప్పి, కృష్ణద్వైపాయన ముని ద్రుపదుడికి, పూర్వకాలం ఇలాటి వివాహాలుండే వనటానికి ఒక నిదర్శనం చెప్పాడు. అదేమిటంటే; నితంతు డనే రాజర్షికి సాల్వేయుడూ, శూరసేనుడూ, శ్రుతసేనుడూ, సారుడూ, అతిసారుడూ అనే అయిదుగురు కొడుకులుండేవారు.



ఎంతో అన్యోన్యంగా ఉండే ఆ అయిదుగురూ కలిసి ఉశీనర రాజకుమార్తె అయిన అజితను పెళ్ళాడి, ఆమె యందు ఆ అయిదుగురూ సంతానం కన్నారు. ఇది ఒకప్పుడు ఉండిన ఆచారమే.

వ్యాసుడైన కృష్ణద్వైపాయనుడే ఈ మాట చెప్పాక ద్రుపదుడికి సందేహ నివృత్తి అయింది. పాండవులందరూ తన కుమార్తెను పెళ్ళాడటానికి సమ్మతించాడు.

ఆ రోజే మంచి లగ్నం ఉన్నది. చంద్రుడు పుష్యమి నక్షత్రంతో కలిసి ఉన్నాడు. అందుచేత పాండవులకు ద్రౌపదితో ఆ రోజే వివాహం కావటం మంచిదని కృష్ణద్వైపాయనుడన్నాడు. ద్రుపదుడు వెంటనే వివాహ యత్నాలు ప్రారంభించాడు. కాంపిల్య నగర మంతటా అరటిచెట్లూ, పోకగుత్తులూ అమర్చారు. లేత రావిఆకుల తోరణాలు అమర్చారు. అన్ని ఇళ్ళముందూ గంధం కలిపిన నీటితో అలికి, కర్పూరంతోనూ, ముత్యాలతోనూ ముగ్గులు పెట్టారు. నగర మంతా అలంకరించబడి, జనంతో కిటకిట లాడింది. అంతటా పుష్పమాలలు కనిపించాయి, సువాసనలు కొట్టాయి, మంగళాశీర్వచనాలు వినిపించాయి. ద్రుపదుడి భవనానికి ఈశాన్యాన పెళ్ళి



పందిరి వేశారు. దానిని చక్కగా అలంకరించారు. దాని స్తంభాలకు ఆకుపచ్చ పట్టుబట్టలు చుట్టారు. రంగురంగుల బట్టలతో చాందినీ అమర్చి, దానికి ముత్యాల మాలలూ, పుష్పమాలలూ వేళ్ళాడగట్టారు. బంగారు తిన్నె మీద అగ్నికుండం ఏర్పాటు చేశారు. బంగారు పాత్రలతో పుణ్యనదీ జలాలు తెచ్చిపెట్టారు.

అక్కడికి పాండవు లయిదుగురూ మంగళస్నానాలు చేసి, మేలి వస్త్రాలు ధరించి వచ్చారు. చక్కని బట్టలూ, అలంకరణలూ ధరించి సఖులతో సహా ద్రౌపది కూడా వచ్చింది. ధౌమ్యుడు పుణ్యాహ





వాచన మయాక ముందుగా ద్రౌపదినీ, ధర్మరాజునూ పెళ్ళిపీటల మీద కూర్చో బెట్టి, హోమం చేయించి, శాస్త్రోక్తంగా వారిద్దరికీ పాణిగ్రహణం చేయించాడు. తరవాత భీమార్జున నకుల, సహదేవులు అదే విధంగా ద్రౌపదిని పెళ్ళాడారు.

ద్రుపదుడు తన అల్లుళ్ళందరికీ వేరు వేరుగా వెలలేని ఆభరణాలూ, ధనమూ, ధనేతరాలూ, రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, దాసీలూ, పాడిఆవులూ కానుక ఇచ్చాడు. పాండవులు తన అల్లుళ్ళు అయి ఉండగా దేవతలు కూడా తనను ఏమీ చెయ్యలేరని ద్రుపదుడికి తోచింది.



వివాహ విధి పూర్తి కాగానే ద్రౌపది అంతఃపురంలోకి తిరిగి వచ్చి, ఉత్తమాసనంలో అంతఃపుర స్త్రీల మధ్య కూర్చుని ఉన్న కుంతీదేవి వద్దకు పోయి, సాష్టాంగ వందనం చేసి, చేతులు జోడించి నిలబడింది. కుంతీదేవి తన కోడలిని చూసుకుని ఎంతో ముచ్చటపడి, ఆమెకు నీతులు చెప్పి, ఆశీర్వదించింది.

పాండవులు ద్రౌపదిని పెళ్ళాడినట్లు తెలియగానే కృష్ణుడు ఆ అయిదుగురికీ అంతులేని కానుకలు తీసుకువచ్చాడు. తరవాత పాండవులు కృష్ణుడితో సహా కాంపిల్యనగరం లోనే ఉండి సమస్త భోగాలూ అనుభవించసాగారు.

ద్రౌపదీ స్వయంవరంనాడు మత్స్య యంత్రాన్ని కొట్టి, కర్ణుడితో యుద్ధం చేసిన వాడు అర్జునుడేననీ, శల్యుణ్ణి ఓడించిన వాడు భీముడనీ, పాండవులు లక్క యింట కాలిపోక సజీవులుగానే ఉన్నారనీ, ఎలాగో వారు కుంతీదేవితో సహా ఆ ఆపద నుంచి బయట పడ్డారనీ రాజలోకానికి ఇప్పుడు తెలిసిపోయింది.

హస్తినాపురానికి తిరిగి వెళ్ళిపోయే దుర్యోధనుడికి కూడా ఈ మాట తెలిసింది. పాండవుల అదృష్టం చూసి దుర్యోధనుడు

కుంగిపోయాడు. అప్పుడు దుశ్శాసనుడు తన అన్నను సమీపించి, "బ్రాహ్మణ వేషం వెయ్యకపోతే ఆ అర్జునుడికి ద్రౌపది దక్కి ఉండునా? వాడు అర్జునుడని తెలిస్తే అంత తేలికగా వదిలిపెట్టేవాళ్ళమా? ఇప్పు డనుకుని ఏం లాభం? బాహుబలం కన్న దైవబలం హెచ్చు కావటం జరిగింది!" అన్నాడు. ఈ విధంగా వాళ్ళు జరిగిన దానికి విచారిస్తూ, లక్కయిల్లు కాల్చటానికి తాము నియోగించిన పురోచనుణ్ణి తిట్టుకుంటూ హస్తినాపురం చేరుకున్నారు.

జరిగినదంతా తెలియగానే సంతోషించిన వాడు విదురుడు. ఆయన ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళి ద్రౌపదీ స్వయంవర వార్త లన్నీ తెలిపాడు. ఏ కారణం చేతనో ధృత రాష్ట్రుడు, ద్రౌపది తన కొడుకైన దుర్యోధ నుణ్ణి వరించిం దనుకుని, పరమానందం చెంది, "ఆ ద్రౌపదికి రత్నాభరణాలనూ, చీనాంబరాలనూ పంపించు. వెంటనే ఆమెను హస్తినాపురానికి రప్పించు." అన్నాడు విదురుడితో.

ధృతరాష్ట్రుడు తన మాటలను అపార్థం చేసుకున్నట్టు విదురుడు గ్రహించి, "ద్రుప దుడి కూతురు వరించినది అర్జునుణ్ణి. పాండవులు అయిదుగురున్నూ ఆ ద్రౌపదిని పెళ్ళాడేశారట," అని వివరంగా చెప్పాడు.

అంతా విని ధృతరాష్ట్రుడు, "అయితే ఏమంటావు? నాకు, నిజం చెప్పాలంటే, దుర్యోధనుడూ వాళ్ళకన్న పాండవులంటేనే హెచ్చు ప్రేమ. వాళ్ళు ఎంత పరాక్రమ వంతులు! పెద్దవాళ్ళకు ఎలా సేవలు చేస్తారు! యుక్తాయుక్తాలు వాళ్ళ కెంత బాగా తెలుసు! ద్రుపదుడితో సంబంధం చేసుకుని వాళ్ళిప్పుడు మరింత బలవంతు లయారు. వాళ్ళు బతికి బాగున్నారంటేనే నా కెంతో సంతోషమయింది!" అన్నాడు.

"రాజా, ఎల్లకాలమూ నీ బుద్ధి ఇలాగే ఉండుగాక!" అన్నాడు విదురుడు.



# లెనిన్ బాల్యం



## 2

లెనిన్ శ్రమశక్తిని కూడా కష్టపడి పెంపొందించుకున్నాడు. అతను స్కూలులో పాఠాలు చాలా శ్రద్ధగా వినేవాడని, చురుకైన విద్యార్థి అని మొదటనే చెప్పాను. వస్తుతః ప్రజ్ఞావంతుడు గనక చదువులో రాణించడానికి అతను అట్టే శ్రమించే అవసరం లేకపోయింది.

అతను తనను గురించి గాని, తన చుట్టూ ఉన్నవారిని గురించి గాని చాలా సూక్ష్మంగా విమర్శించుకునేవాడు గనక తన లోపాలు తాను త్వరగా గ్రహించేవాడు. దీన్ని అతను పనిపెట్టుకుని అలవాటు చేసుకున్నాడు. అతను విశ్వవిద్యాలయంలో గ్రాడ్యుయేషన్ చేసే నాటికి ఇది అతని స్వభావంలో ఒక ప్రముఖ లక్షణంగా పరిణమించింది. పెద్దయాక ఈ గుణం అతనిలో అద్భుతంగా రూపొందింది.

వ్లదీమిర్ చిన్నపిల్లవాడుగా ఉన్నప్పుడే అతడు తన పరిసరాలను నిశితంగా పరిశీలించటం సాధారణంగా గమనించే దాన్ని. అతను చలాకీగా, ఆకతాయితనంగా ఇతరులలో దౌర్బల్యం పసికట్టి, ఏడిపించి ఆనందించేవాడు; కాని ఇతర విషయాలు కూడా కనిపెట్టేవాడే. ఇతరులలో మంచి కూడా గ్రహించి, ఆ మంచి తనలో ఉన్నదో లేదో చూసుకునేవాడు. అలాంటి దేదైనా కనిపిస్తే తాను నేర్చుకోగోరేవాడు.

అతనిలోని అత్యుత్తమ లక్షణం ఇదే ననుకుంటాను.

చిన్నతనంలో అతను ఎన్నడూ గొప్పలు చెప్పుకోవటం గాని, డంభం ప్రదర్శించడటం గాని ఎరగడు. పెద్దయాక కూడా అతనికి ఈ అవలక్షణాలు సరిపడేవి కావు. 1920 లో ''కామ్సమాల్''

ఎ. ఉల్యానవ



ఎ. ఉల్యానవ (రచయిత్రి)

మూడవ సమావేశంలో మాట్లాడుతూ యువకులు అలాంటి దురవాట్లను దూరంగా ఉంచాలని చెప్పాడు.

అయినా వ్లదీమిర్‌కు సరదా అంటే ఇష్టమే. తన స్నేహితులు చేరినప్పుడూ, తన కన్న చిన్నవాళ్ళిద్దరూ వెంట ఉన్నప్పుడూ అతను అన్ని ఆటలకూ ముందుండేవాడు. అతని నవ్వుతోనూ, అంతులేని హాస్య కథలతోనూ, కబుర్లతోనూ రోజూ ఇల్లు మారుమోగుతూ ఉండేది.

వేర వసీల్యెవ్న కష్కదమోవ అనే ఆమె మా కుటుంబానికి ఆప్త స్నేహితురాలు. టౌను పబ్లిక్ స్కూల్లో ఉపాధ్యాయిని. ఆమె తన అనుభవాలు రాస్తూ, టీ భోజనాలప్పుడు మా ఇల్లు ఎలా ఉల్లాసంగా ఉండేదో వర్ణించింది—"వ్లదీమిర్, అతని రెండో సోదరి ఓల్గా అందరి కన్న ఎక్కువ గోల చేసేవారు. ఉత్సాహపూరితమైన వారి గొంతులూ, వారి నవ్వులూ ఒకంతట నిలిచేవి కావు." అన్నదామె.

వాళ్ళు బడిలో తాము చేసిన అల్లరీ, ఆకతాయితనాలూ అన్నీ చెప్పేవాళ్ళు. నాన్న కూడా మాతో కబుర్లు చెప్పేవాడు సరదాగా. ఆయన తన గది నుంచి లేచి వచ్చి, మా మధ్య వచ్చి కూర్చుని, స్కూలు జీవితానికి సంబంధించిన గమ్మత్తులూ, కబుర్లూ, తాను చదువుకున్నప్పటి కబుర్లూ, తన మిత్రుల సంగతులూ, చెప్పేవాడు. "అందరూ ఉల్లాసంగా నవ్వేవారు. అలాటి స్నేహపాత్రుల మధ్య కొత్త అనిపించటం జరగదు," అని కష్కదమోవ రాసింది.

వ్లదీమిర్‌కు సంగీత మంటే కూడా చాలా యిష్టం. అతనికి ప్రారంభ పాఠాలు అమ్మే చెప్పి, పిల్లల పాటలూ, తేలిక పాటలూ ఇచ్చింది. అతను వాటిని వాయించటం త్వరలోనే చక్కగా నేర్చుకున్నాడు. అప్పట్లో మంచి సంగీత వేత్త అయే లాగా కనిపిం



చడం చేత, పరిమిలా అతను సంగీ తాన్ని వదిలిపెట్టేసినప్పుడు అమ్మ చాలా నొచ్చుకున్నది.

వసంతకాలం రాగానే పంజరాల నుంచి పక్షులను విడిచిపెట్టే ఆచారం ఒకటి ఉండేది. ఈ ఆచారం అంటే వ్లదీమిర్‌కు చాలా ఇష్టం. అమ్మను అడిగి డబ్బు తీసుకుని ఒక పక్షిని కొని, దాన్ని పంజరం నుంచి బయటికి వదిలేవాడు.

చిన్న తనంలో అతనికి పక్షులను పట్టుకునే సరదా కూడా ఉండేది. అతను తన స్నేహితులతో కలిసి పక్షుల కోసం ఉచ్చులు వేసేవాడు. ఒకసారి ఒక "లినెట్" (ఒక రకం జీనువాయిపిట్ట) ను అతని పంజరంలో చూశాను. దాన్ని అతను పట్టుకున్నాడో, కొన్నాడో ఎవరైనా ఇచ్చారో నాకు గుర్తులేదు. అది ఎంతోకాలం బతకలేదన్నది మాత్రమే జ్ఞాపకం ఉన్నది. అది దిగులు పడి, ఈకలన్నీ చెరుపుకుని చివరకు చచ్చిపోయింది. అతను గంభీరంగా ఆ చచ్చిన పిట్ట కేసి చూసి, పెద్ద తీర్మానంతో, "ఇంకెన్నడూ పక్షులను పంజరంలో పెట్టను," అన్నాడు.

ఆ మాట మీదనే ఉండిపోయాడు కూడానూ.



చిన్నవాటి లెనిన్ కుటుంబం

అతను చిన్నతనంలో చేపలు పట్టటానికీ, పక్షులను పట్టటానికీ సరదాగా తిరిగాడే గాని, అవి అతనికి వ్యసనం కాలేదు. కాస్త పెద్ద వాడు కాగానే ఆ వ్యాపకాలు మానేశాడు.

బడిలో అతనికి లాటిన్‌భాష మీదా, హిస్టరీ జాగ్రఫీల మీదా, సాహిత్యం మీదా అభిమానం జాస్తిగా ఉండేది. కాంపోజిషన్లు రాయటమంటే మహా ఇష్టం. చాలా బాగా రాసేవాడు.

ఏదన్నా కాంపోజిషన్ రాసేటప్పుడు కేవలమూ పాఠ్యపుస్తకాలలో చదివిన వాటితోనూ, ఉపాధ్యాయులు చెప్పిన వాటి



తోనూ తృప్తిపడక లైబ్రరీ నుంచి పుస్తకాలు తెచ్చుకునేవాడు. అతని కాంపొజిషన్లలో విషయం భారీగా ఉండేది. శైలి సాహిత్య ప్రమాణంలో ఉండేది. పెద్ద క్లాసులకు సాహిత్యం చెప్పే హెడ్మాస్టరుకు వ్లదీమిర్ అంటే చాలా అభిమానం. అతన్ని బాగా మెచ్చుకుని, ఫస్టుమార్కు ఇచ్చేవాడు.

అతనికి విరామకాలమూ, శలవు దినాలూ పరిగెత్తటంలోనూ, నడవటంలోనూ, చలి కాలంలో స్కేటింగ్ చెయ్యటంలోనూ, వేసవికాలం "క్రోకే" ఆటలోనూ, ఈదటం లోనూ గడిచిపోయేది. (అతను సూర్యకాంత విత్తులు మెక్కుతూ చదువుకునేవాడు.) అతనికి సాహసగాథలు చదవటం ఇష్టం ఉండేది కాదు, గోగోల్ రచనలూ, తుర్గి న్యేవ్ రచనలూ పదే పదే చదివేవాడు.

వ్లదీమిర్ తన సహాధ్యాయులతో పొత్తుగా ఉండి, వారికి సహాయ పడేవాడు, వారి వ్యాసాలు సరిదిద్ది పెట్టేవాడు, ఒక్కొక్క సారి తన తోటి వాడికి బుర్ర పని చెయ్యక పోతే రచన కూడా తానే చేసి, సహాయం చేసేవాడు. తన సహ పాఠీలకు మంచి మార్కులు వచ్చేటట్టు రాయటానికి సహాయపడటమే కాకుండా, అలాటి సహాయం వాళ్ళకు తన నుంచి గాని, మరొ కరి నుంచి గాని లభించినట్టు ఎవరికీ తెలియకుండా చూడటం తన కిష్టమని అతను నాతో అన్నాడు.

స్కూలు మధ్య విరామ కాలంలో అతను తోటి విద్యార్థుల సందేహాలు తీర్చేవాడు. పాష లాగే ఒక్కొసారి స్కూలుకు అర గంట ముందే వెళ్ళి, ఏ గ్రీకు, లేక లాటిన్ వ్యాసాన్ని తర్జుమా చెయ్యటానికి తోడ్పడ టమో, లేక ఏ క్లిష్ట గణిత సమస్యను విశదీకరించటమో చేసేవాడు.

—(అయిపోయింది)

చిన్నవాటి లెనిన్, అతని చెల్లెలు ఓల్య



ప్రపంచపు వింతలు: **102. ట్రినిడాడ్‌లో హిందూ ఆలయం**

ఈ ఆలయం లాస్ లోమాన్ నగరంలో ఉన్నది. పూజకు వినియోగించే పుష్పాలు మందారాలు. అర్చకుడు—డూన్ పండిట్—శంఖం ఊది, ఇత్తడి గంట వాయిస్తూ పూజ చేస్తున్నాడు. ట్రినిడాడ్ లోని హిందువులకు ఆయన చేసిన సేవను గుర్తించి బ్రిటిషువారు బహూకరించిన పతకాన్ని ఆయన ధరించి ఉన్నాడు.



Photo by N. M. Kutchwala



బహుమతి
పొందిన వ్యాఖ్య

భద్రం చిట్టీ పడతావు

పంపినవారు:
ఐ. వి. రావు, తంగెళ్ళమూడి

Photo by K. S. Vijayaker



బహుమతి
పొందిన వ్యాఖ్య

బడాయి చేస్తే చెడతావు

పంపినవారు:
ఇ. వి. రావు, తంగెళ్ళమూడి

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1970 జులై నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి జైన వ్యాఖ్యయి ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలో గాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: భద్రం చిట్టీ పడతావు

రెండవ ఫోటో: బడాయి చేస్తే చెడతావు

పంపినవారు: ఈదుపల్లి వెంకటేశ్వరరావు,
తంగెళ్ళమూడి. (పశ్చిమ గోదావరి జిల్లా)

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

## తీవ్రమైన బెణుకునొప్పి నిమిషాలలో పోయింది!



# అమృతాంజనం

## ప్రభావంవల్లనే!

బెణుకులు, జలుబులు, తలనొప్పి, కండరాలనొప్పి—వీటిని చప్పున చల్లగా తగ్గించుకోండి. బాధగా ఉన్న చోటు మీద అమృతాంజనం రాయండి. వెంటనే గుణం ఇస్తుంది. 75 సంవత్సరాలపైగా ఇంటింటి దీపమై వెలుగుతోంది అమృతాంజనం! ఎప్పుడూ ఒక సీసా దగ్గర ఉంచుకోండి. అమృతాంజనం అరాబేసీ పెద్ద సీసాలలోనూ, చిన్న తబ్బాలలోనూ కూడా దొరుకుతోంది.




అమృతాంజనం 10 ఔషధాలు కలిసినది.

నొప్పులను, జలుబులను చప్పున, చల్లగా తగ్గిస్తుంది.

అమృతాంజన్ లిమిటెడ్:
మదరాసు - బొంబాయి - కలకత్తా - న్యూ ఢిల్లీ - హైదరాబాదు - బెంగళూరు . AM-5338

# సవ్యమైన పెంపకానికి రక్తి బోర్న్‌విటా శక్తి !



ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు. వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాలా అవసరం. తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు. రుచికరమై శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారు చేసేవారు — క్యాడ్‌బరీస్







**శక్తి ఉత్సాహం మరియు రుచికోసం-క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా !**

